ఓం

# మానపరిభాష

ఇది

శ్రీమాన్ ప్రతివాదిభయంకర

## కృష్ణమాచార్యులవారిచే

రచింపఁబడినది

---

# ఆంధ్రవైద్య

## గ్రంథమాలయందు

ప్రకటింపబడినది

బెజవాడ

శ్రీలక్ష్మీవిలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడినది.

 [వెల 0-8-0

# పీఠిక.

"పరితో వ్యాపృతాం భాషాం పరిభాషాం ప్రచక్షతే"

అను న్యాయమునుబట్టి ఆయా తంత్రములయందు అచ్చటచ్చట చెప్పబడియుండు ఆవశ్యకములగు ముఖ్యవిషయములను సమకూర్చి వ్రాయబడిన గ్రంథము పరిభాష యనబడుచున్నది. ఇట్టి గ్రంథములవలన శాస్త్రాధ్యయనము చేయదలచినవారికి ప్రథమ జ్ఞాతవ్యములగు విషయములు ముందు తెలుసుకొనుట కవకాశము నిచ్చుటచే అతి గహనములగు తంత్రగ్రంథములయందు మనసు చొచ్చుటకు సౌకర్యము కలుగును. మరియు తంత్రగ్రంథముల నధ్యయనము చేయుచుండునపుడు కలుగుచుండు అనేక సందిగ్ధములగు విషయములు నిర్ణయింపబడియుండుటచే ప్రథమ ప్రవేశ మొనర్చువారికి మిగుల సులభముగ నడక సాగును.

ఈ యుద్దేశమునుబట్టియే పూర్వమీమాంస ఉత్తరమీమాంస న్యాయము వైశేషికము వ్యాకరణము జ్యోతిషము మున్నగు ప్రాచీనులు నిర్మించిన తంత్రములకన్నిటికిని పరిభాష లేర్పరుపబడియున్నవి. ప్రాచీన తంత్రములలో చేరిన ఆయుర్వేదమునకు సంబంధించిన ఉద్గ్రంథములును అతిగహనములుగనుండుటచే తంత్రాధ్యేతల సౌకర్యమునకై పరిభాషలు కొన్ని సమకూర్పబడియున్నవి

ఇట్టి పరిభాషకు సంబంధించిన విషయముల నేకములు చరక సుశ్రుత వాగ్భటాదుల తంత్రములయందు అచ్చటచ్చట విరళముగను సూత్రకల్పములయందు అధికముగను చేర్పబడియుండును. ఉద్గ్రంథముల శైలి ననుసరించి ప్రస్తావవశమున నచ్చటచ్చట వ్రాయబడియుండు నీముఖ్యవిషయములు ప్రథమమున గ్రహింపబడినపుడుగాని ఇప్పటివారికి తంత్రవిషయములు సుబోధములుగ నుండజాలవు. అందుచే నిట్టి విషయముల నన్నిటిని ఒక్కచోట చేర్చి అందలి సందేహములు తెలియునట్లు నిర్ణయములొనర్చి పరిభాషాగ్రంథములు వ్రాయు నావశ్యకత యేర్పడినది.

ఈ యావశ్యకతను బట్టి శార్ఙ్గధర భావమిశ్ర వృందమాధవ చక్రదత్తాదు లగు పిమ్మటి ఆయుర్వేద గ్రంథకర్తలు తమ గ్రంథములయందు మొదట కొంతవరకు పరిభాషాభాగములను చేర్చి పిమ్మట నిదానచికిత్సలను వ్రాసియుండిరి. చందనాచార్య అను మహనీయులొకరు "భేషజకల్ప"మను పరిభాషావిషయమును మాత్రము బోధించు

గ్రంథము నొకదానిని రచించియున్నారు. ఔత్తరాహులగు విద్వాంసులు కొందరు పరిభాషావిషయములను మాత్రము బోధించు గ్రంథములు వ్రాసియున్నారు. వానిలో వంగదేశీయులగు గంగాధరశాస్త్రి కవిరాజ అను వారి గ్రంథము కొంచెము ముఖ్యమైనదిగ కన్పట్టుచున్నది.

ఈ గ్రంథములన్నిటిని పరిశీలించి విషయములను సంగ్రహించి శ్రీయుత వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులవారు "ఆయుర్వేద పరిభాష" యను పేరున నొకపరిభాషాగ్రంథమును రచించియున్నారు. ఈగ్రంథమునేక విషయములు చేర్చి తెనుగువ్యాఖ్యానముకూడ కూర్చి వ్రాయబడియుండుటచే ఆయుర్వేద తంత్రాధ్యయనము చేయ తలంపుగొను ఆంధ్ర విద్యార్థుల కిది అత్యంతోపకారకమై విలసిల్లుచున్నది.

కాని ఈ ఆయుర్వేదపరిభాషయు ఇంకను అనేక విషయములు చేర్పవలసి యుండుటచే అసంపూర్ణముగనే యున్నది. అనేక సందిగ్ధవిషయములు నిర్ణయింపబడియుండలేదు. కొన్ని విషయములు విషయవిభాగములు సరిగనుండమిచే సంకలితములై అసంబద్ధములుగ నున్నవి. ఇట్టి పరిస్థితులు విద్యార్థులకు పాఠములు చెప్పునపుడు అస్మదాదులకు చికాకును కలిగించుచున్నవి. అందుచే అట్టివానిని సవరించి అనేక విషయములు చేర్చి సందిగ్ధాంశముల నిర్ణయము నొనర్చి ఈగ్రంథము వ్రాయబడినది.

ఆయుర్వేదపరిభాషయందు వ్రాయబడిన మానపరిభాషాభాగము శార్ఙ్గధర సంహితనుండి మాత్రము సంగ్రహింపబడియుండుటచే మాగధములగు మానములు మాత్రము ఇందు వ్రాయబడినవి. అందును కాలింగమాగధమానములకు గల పరస్పర భేదము ఎట్టిదో అట్టిభేదమునకు గల కారణమేమో అందు చర్చింపబడలేదు. చరక సుశ్రుతవాగ్భటులతంత్రములందును రసతంత్రములయందును భైషజ్యరత్నావళియున్నగు భిన్నప్రాంతములయందలి గ్రంథములయందును వ్రాయబడియుండు మానపరిభాషాభాగములను చర్చించి తమపరిభాషాభాగముతో సాధర్మ్య వైధర్మ్యముల నిరూపించి నిర్ణయించలేదు. మరియు ప్రకృతకాలమున దేశవ్యవహారమున ప్రసిద్ధములైయుండు మణుగులు శేర్లు తులములు చిన్నములు గేలనులు మున్నగు ఇప్పటిమానములకును మునుపటి మానములకును సాధర్మ్యకల్పనముచేయలేదు. ఇట్టిపరిస్థితులవలన ఇక్కాలమున ప్రాచీన గ్రంథముల నధ్యయనము చేయించునపుడు మానపరిభాషా విషయమున నిస్సంశయమును పరిపూర్ణమును నగు జ్ఞానము శిష్యులకు కలిగించుటకు గురువులకు సాధ్యము కాకున్నది. ద్రవ్యములకు సంబంధించిన పరిభాషలు మానసంజ్ఞాప్రతినిధి లేఖో

ప్రకరణములయందు కొంచెము కొంచెముగ చేర్పబడినవి. రసతంత్రమునకును చికిత్సా విధులకును సంబంధించిన పరిభాషలిందు చేర్పబడియుండలేదు. ఇట్లు ఆవశ్యకవిషయము లసంపూర్ణములుగను సందిగ్ధములుగను నుండుటచే ఇందు కొంతమార్పు చేయుట ఆవశ్యకమైన ఈవిషయములను సూచించుచు గ్రంథపీఠికయందు వారిట్లు వ్రాసియున్నారు. "కొలదికాలమునకే "రసపరిభాష" యను పేర రెండవ భాగమునుకూడ ముద్రింపించి ప్రకటింప సన్నద్ధులమై యున్నాము. మఱియు "వైదికపరిభాష" "రసపరిభాష" లయందు నియమితమగు యంత్రపస్థరావ మొదలగువానిని తూచుకొనుటకును కొలుచుటకును అనుకూలములగు సహాయములను విపులముగ చర్చించి వేరొక గ్రంథరూపమున శీఘ్రకాలము లోపలనే ముద్రింప నున్నాము. కావున నిందు వానిని నిరూపించియుండలేదు".

ఇట్లు పూర్తిచేయవలసిన భాగములను పూర్తిచేయకనే శ్రీ గోపాలాచార్యులవారు దివికేగుటయు పిమ్మట వారి విషయమున శ్రద్ధవహించకపోవుటయు సంభవించి ఈలోపము పూరింపబడలేదు. అందుచే ఆయుర్వేద విద్యార్థులకు కలుగుచుండు అస్వకునాంతరాయమును తొలగించుటకై ఈ ప్రయత్నమునకు ప్రవేశించవలసినది.

ఆయుర్వేద పరిభాషయందు పది ప్రకరణములయందు చెప్పబడిన విషయము లన్నియు ఎనిమిదిభాగముల క్రింద సంగ్రహించి చేర్చవలసిన విషయములను చేర్చి పూరించి ఈ గ్రంథము వ్రాయబడినది. ఇందు మానపరిభాష, ద్రవ్యపరిభాష, ద్రవ్యగుణపరిభాష, భేషజకల్పనాపరిభాష, భైషజ్యయోగపరిభాష, అన్నాదిపాకపరిభాష, రసతంత్రపరిభాష, చికిత్సావిధిపరిభాష అను ఎనిమిది ప్రకరణములయందు విషయ విస్తారమంతయు సంగ్రహించి కూర్చబడినది.

శ్రీ గోపాలాచార్యులవారు పదునెనిమిది సంవత్సరముల క్రిందట రచించిన విషయములను పరామర్శ మొనరించి పునఃపూరణముతో వారియత్నమును పెంపొందించు భాగ్యము నాకు కలిగినందులకు ఎంతయు సంతోషమును పొందుచున్నాను. విద్వాంసులు నా యీ సాహసమును మన్నించి గుణదోషములు వెలువరింప వేడుచున్నాను

# మాన పరిభాష.

మొదట నీగ్రంథమంతయు నొక్కమారుగ ముద్రించి ప్రచురింపదలంచి యారంభమొనర్చితిని. ముద్రాపకుల యశక్తిచే నట్లు చేయజాలకపోయితిని. ఈభాగమునుమాత్రము ముద్రించి పూర్తిచేయునప్పటికి ముద్రాపకు లశక్తతచూపిరి. పిమ్మట ఈభాగముమాత్ర మొకగ్రంథముగ కూర్చించి ప్రచురింపవలసినదని మిత్రు లనేకులు చెప్పుచుండుటచే ఇదియొక గ్రంథముగ ప్రచురించితిని. తక్కినభాగములును ఈభాగమును కలిపి మరల ముద్రించి అచిరకాలమున ప్రచురింపబడును.

ఈభాగమున చరక సుశ్రుత వాగ్భటుల తంత్రములయందును శార్ఙ్గధరాదుల గ్రంథములయందును భైషజ్యరత్నావళియందును భేషజకల్పమునను రసతంత్ర గ్రంథములయందును చెప్పబడిన మానములన్నిటిని కూర్చి వానికి పరస్పరముకలిగియుండు భేదములు చర్చించి వివరింపబడినవి. దైర్ఘ్యమానము కాలమానము మొదలగునవి కూడ కూర్పబడినవి. మరియు ఈమానములకు ప్రకృతకాలమున వ్యవహారమునందుండు దేశిక వైదేశికమానములగు తులములు, చిన్నములు, వీసెలు, మణుగులు, శేర్లు, గేలనులు మొదలగు లెక్కలకు సరిపుచ్చి ప్రతిమానమునకును తక్కిన మానములతో గల సాదృశ్యము సులభముగ తెలియునట్లు పథకము లేర్పరుప బడినది. ఇట్లు విపులముగ వివరించుటవలన ఆయుర్వేదపరిభాషయందు ఎనిమిదిపుటలలో ముగింపబడిన గ్రంథము ఇందు ఏనుబదిపుటలు పట్టినది. ఇట్లే అన్నివిషయములయందును గ్రంథము విపుల మొనర్పబడినది. సహృదయు లీవిషయముల నెల్ల పరిశీలించి లోపాలోపముల తెల్లడించి నాశ్రమకు ఫలము నొడగూర్తురుగాక యని ప్రార్థించుచున్నాను.

గ్రంథకర్త.



# విషయసూచిక

—:o:—

శ్రీమద్ధన్వంతరయే నమః

# ఆయుర్వేదాంగ పరిభాషా సంగ్రహము

## పరిభాష యనగా నేమి?

మూలము॥ సూత్రము॥ సందిగ్ధ విషయ నిర్ణాయకత్వం పరిభాషాత్వం॥

తాత్పర్యము: ఓషధులు ఔషధములు వాని యుపయోగము మొదలగువానియందు తఱచు సంభవించుచుండు సందిగ్ధములగు విషయములను నిర్ణయించు భాగమునకు పరిభాషయనిపేరు. "పరితః భాష్యంతే సందిగ్ధవిషయాః అస్యాం ఇతి పరిభాషా" అని దీనివ్యుత్పత్తి చెప్పబడినది. ఓషధులలో ఎట్టి ఓషధులకు ఏయే యంగములు గ్రహింపదగినవిగ నుండును? ఔషధములను చేయునపుడు వేనిని ఎంతపరిమాణమున గ్రహింపవలసియుండును? పారిభాషికములుగ గ్రహింపబడిన త్రికటు త్రిఫలాదినామములయొక్క అర్థమేమి? అనునిట్టి విషయములను ఔషధములనుచేయునపుడును వానిని ఉపయోగించునపుడును అవలంబింపవలసినవిధులును, మానములును (కొలతలు తూనికలు మున్నగునవియు) వివరించి తెలియజేయుగ్రంథమునకు పరిభాషయనిపేరు అని ఈ వ్యుత్పత్తివలన నిర్ణయముచేయదగియున్నది. ఇట్టినిర్ణయములును వివరములును చరక సుశ్రుతాదుల తంత్రములయందు చెప్పబడియుండు ఔషధయోగములు వ్యాఖ్యాతల నిర్ణయములుమున్నగువానివలన ఏర్పరుపబడుచుండెను. ఇట్లనేక తంత్రములనుండి ఆయా విషయములను సమకూర్చి పరిభాషలనుపేరున నేర్పరుపబడుచుండెను.

మూ॥ శ్లో॥ అవ్యక్తానుక్త లేశోక్తసందిగ్ధార్థ ప్రకాశికాః
పరిభాషాః ప్రకథ్యంతే దీపభూతా స్సునిశ్చితాః॥

తా॥ శాస్త్రములయందు అస్పష్టములుగను, అల్పములుగను సందిగ్ధములుగను, చెప్పబడియుండు విషయములను స్పష్టముగను విస్తృతముగను నిస్సంశయముగను తెలుసుకొనుటకు ఉపయోగములుగ నుండునవి పరిభాషలనబడును. పరిభాషలవలన పైయట్టిఅవ్యక్తానుక్తాది విషయములను తెలుసుకొనుటకు వీలుకలుగును. చీకటిప్రదేశముల యందు అవ్యక్తములుగను, లేశములుగను, సందిగ్ధములుగను కనబడు చుండువస్తువులను దీపపుసహాయమున నెరుగుట కానుకూల్యము కలిగి యుండునట్లు ఈపరిభాషలవలన శాస్త్రములయందలి అవ్యక్తానుక్తాది షయముల నెరుంగుట కానుకూల్యము కలుగుచుండును.

## ప రి భా షా వి ష య ము లు

మూ॥ శ్లో॥ మానం ద్రవ్యం ద్రవ్యగణాః భేషజానాం చ కల్పనా
భైషజ్యానాం చోపయోగః పాక శ్చాన్నాదికః స్తథా
రసతంత్రోక్తవిషయాః చికిత్సావిధి రేవ చ
పరిభాషావిభాగ స్తు ద్వ్యష్టవిధసమ్మతః

తా॥ మానపరిభాష, ద్రవ్యపరిభాష, ద్రవ్యగణపరిభాష, భేషజకల్పనాపరిభాష, భైషజ్యోపయోగపరిభాష, అన్నాదిపాకపరిభాష, రసతంత్రపరిభాష, చికిత్సావిధిపరిభాష, అని పరిభాషకు సంబంధించిన విషయముల విభాగము ఎనిమిదివిధములుగ కనుబడుచున్నది.

వానిలో మానపరిభాషయందు ఔషధములుమున్నగువాని తూనికలు కొలతలు మున్నగువానికి సంబంధించిన సందర్గములును జ్ఞాతవ్యములునునగు విషయములు తెలుపబడును. ద్రవ్య పరిభాషయందు ఔషధములు చేయుటకు పయోగించుద్రవ్యములు వానివిభాగములువాని

అంతర్భాగములు వానియుపయోగము ప్రతినిధులు గ్రహణము మున్నగునవి తెలుపబడును. ద్రవ్యగణపరిభాషాభాగమున గణములుగ చెప్పబడియుండు ఔషధద్రవ్యములకు సంబంధించిన వివరములు తెలుపబడును- భేషజకల్పనా పరిభాషయందు ఔషధద్రవ్యములనుకూర్చి ఔషధములుగ సిద్ధముచేయబడునపుడు తెలుసుకొనదగిన విశేషములు తెలుపబడును- భైషజ్యోపయోగ పరిభాషయందు సిద్ధములయిన ఔషధములు చికిత్సయందుపయోగింపబడునపుడు తెలియదగిన విశేషములు తెలుపబడును- అన్నాదిపాక పరిభాషయందు స్వస్థులకు ఆహారములుగ నుపయోగింపబడుచుండు అన్నము, కూరలు, భక్ష్యములు, మాంసములు మున్నగువానిని సిద్ధముచేయుటకు కావలసిన విశేషములును, రోగులకు ఆహారముగ ఉపయోగింపదగిన మండములు, పేయములు, యవాగువులు, యూషములు, మాంసరసములు మున్నగు ద్రవ్యములను సిద్ధము చేయురీతులును తెలుపబడును- రసతంత్రపరిభాషయందు రసతంత్రసిద్ధాంతమునందుపయోగమునకువచ్చు యంత్రతంత్రాదులు వివరింపబడును- చికిత్సావిధి పరిభాషయందు చికిత్సా భాగమునకు సంబంధించినవిశేషములును వానికిసంబంధించిన వివరములును తెలుపబడును- ఇట్లు ఈయెనిమిదివిధములగు పరిభాషలును వైద్యప్రక్రియలను తెలుసుకొనదలచినవారికి అవశ్యజ్ఞేయములుగ కనుబడుచుండుటచే ఆయా శాస్త్రగ్రంథములయందు చెప్పబడియుండువానినెల్ల పరిశీలించి సేకరించి ఈగ్రంథమున కూర్చబడినవి- ఇట్లీ శ్లోకమువలన గ్రంథారంభమున ప్రేక్షావత్ప్రవృత్తికి సాధనమగు అనుబంధిచతుష్టయము నిరూపింపబడినది. విషయము ప్రయోజనము అధికారి సంబంధము అను నీనాలుగును అనుబంధిచతుష్టయ మనబడును. ఈ శ్లోకముచే ఈగ్రంథమున చెప్పబడు విషయము మానద్రవ్యములకు సంబంధించిన సందిగ్ధములును జ్ఞాతవ్యములును నగువానిని వివరించుట యనియు ప్రయోజనము వైద్యులు విషయములను గ్రహించి ఔషధనిర్మాణమునను చికిత్సావిధియందును నిపుణులగుటయనియు వైద్యులు దీనినిపఠింప నధికారులనియు గ్రంథము

నకును విషయమునకును ప్రతిపాదనము సంబంధమనియు చెప్పబడినట్లు ఎంచవలసియుండును అనుబంధి చతుష్టయ నిరూపణమువలన చదువరులకు విషయప్రవేశమునకు సౌకర్యము కలుగును.

## మా న ప రి భా ష

### మా న ము ల ఉ ప యో గ ము.

( భైషజకల్పము )

శ్లో॥ మాత్రాం నాపేక్షతే యస్మాత్ కషాయాదిషు కల్పనా
తస్మాత్ మాత్రావబోధార్థం నక్ష్యతే మానకల్పనా॥

తా॥ కషాయములు అవలేహములు ఆసవములు అరిష్టములు మున్నగువానిని సిద్ధము చేయునప్పుడును వానిని ఉపయోగించునప్పుడును పరిమాణజ్ఞానము ఆవశ్యకమైయున్నది. పరిమాణమునగా తూనికలు కొలతలు మున్నగునవి. తూనికలు కొలతలు మున్నగువానిని బాగుగ తెలుసుకొనియుండిన మొదల ఔషధములయందు ద్రవ్యముల జేర్చుకొను కౌశలము బాగుగ అలవడును. అందుచే ఔషధములను చేయునపుడు మానములను బాగుగ నెఱుంగవలయును, కావున మానపరిభాష మొదట తెలుపబడును, "మీయతే + అనేన = మానం" అను వ్యుత్పత్తి యందు "మాజ్ = మానె" అను ధాతువుపై ప్రత్యయములు చేరి మానసాధనమను నర్థమున మానశబ్దమేర్పడుచున్నది. ఈవిషయమున శార్ఙ్గధరాచార్యులు—

"నమానేన వినా యుక్తిః ద్రవ్యాణాం జాయతే క్వచిత్
అతః ప్రయోగకార్యార్థం మాన మత్రోచ్యతే మయా"

అని చెప్పియున్నారు

మానములకు సంబంధించిన జ్ఞానమును బాగుగ సంపాదింపని యెడల ఔషధయోగములయందు ద్రవ్యముల జేర్చుకొనుపద్ధతులు తెలియజాలవు- అందుకొరకును ఔషధముల ప్రయోగము నిమిత్తమును

మానములను గురించి యిచ్చట వివరింపబడును అని దీపభావము. మానములు గుర్తెరుగనివారు ఔషధములను సరిగ నుపయోగింప కుండిన నవి సుగుణము నీయ జాలవని ఆంధ్రభేషజకల్పమున చెప్పబడియున్నది.

క॥ ప్రమితుల నే మెరుగక వి । క్రమ పరిమాణము లూనంగ రా దౌషధసం
ఘము జేయు సుగుణమందల । మమల క్రమ మొదవ దెప్పు డచలసుమారీ ॥

ఇందువలన ఔషధములను సిద్ధము జేయుటకును ఔషధములను వాడుక జేయుటకునుకూడ మానజ్ఞానమావశ్యకమని తెలియుచున్నది,

అవతారిక। మానములు అనేకరీతులుగ నుండును ధాన్యాదులను ద్రవ ద్రవ్యములను గొలుచుట కుపయోగించు కొలతమాన మొకటి దీనికే ధాన్యమానమనియు పరిమాణమనియు ప్రస్థమానమనియు పేర్లు గలవు. ఘన ద్రవ్యములనుతూచుట కుపయోగించు తులామాన మొకటి దీనికే ఉన్మానమని పేరుకలదు. ప్రదేశములకు సంబంధించిన పొడవు వెడల్పు లోతు మున్నగువానిని కొలుచుటకుపయోగించు దైర్ఘ్యమాన మొకటి. దీనినే ఆయామమానమనియు అంగుళ మానమనియునందురు. కాలము యొక్క అంతర్భాగముల లెక్కకు పనికివచ్చు కాలమాన మొకటి సంఖ్యనుబట్టి లెక్కపెట్టదగిన సంఖ్యామాన మొకటి-అవి ఇట్లనేకవిధములనుండు నీమానము లన్నియు చికిత్సకునకు తెలిసియుండ దగినవియైయున్నవి. కావున నట్టిమానము లిప్పుడు తెలుపబడును.

శ్లో॥ ఊర్ధ్వమానం కిలోన్మానం పరిమాణంతు సర్వతః
ఆయామస్తు ప్రమాణం స్యాత్ స్సంఖ్యా బాహ్యాతు సర్వతః
( వ్యాకరణశాస్త్రము )

ఈ మానముల నన్నిటిని వైద్యగ్రంథకర్తలు మాగధమానము కాళింగమానము అను నిట్టినామములచే తమగ్రంథములయందు చెప్పియున్నారు. మరియు ఆయాగ్రంథములయందు చెప్పబడియుండుమానములలో దేశకాలభేదమునుబట్టికలుగదగిన భేదము లనేకములగుపడుచున్నవి. అవియన్నియు సవిశేషముగ తెలిసుకొనదగినవగుటచే ఆభేదములన్నియు చెప్పబడి అందుమాగధమానము మొదట చెప్పబడుచున్నది.

## మాగధమానము.

### ( శార్ఙ్గధరసంహిత )

మా॥ శ్లో॥ జాలాంతరగతే భానౌ యత్ సూక్ష్మం దృశ్యతే రజః
తస్య త్రింశత్తమో భాగః పరమాణు స్సకథ్యతే
జాలాంతరగతై స్సూర్యకరై ర్వంశీ విలోక్యతే
త్రసరేణు ర్బుధైః ప్రోక్త స్త్రింశతా పరమాణుభిః
త్రసరేణు స్తు పర్యాయనామ్నా వంశీ నిగద్యతే
షడ్వంశీభి ర్మరీచిః స్యాత్ తాభి ష్షడ్భి స్తు రాజికా
తిసృభీ రాజికాభి శ్చ సర్షపః ప్రోచ్యతే బుధైః
యవోఽష్టసర్షపైః ప్రోక్తో గుంజా స్యాత్ తచ్చతుష్టయమ్
షడ్భి స్తు రక్తికాభిః స్యా న్మాషకో హేమధాన్యకౌ
మాషై శ్చతుర్భి శ్శాణః స్యా ద్ధరణ స్స నిగద్యతే
టంక స్స ఏవ కథిత స్తద్ద్వయం కోల ఉచ్యతే
క్షుద్రకో వటక శ్చైవ ద్రంక్షణ స్స నిగద్యతే
కోలద్వయం చ కర్షః స్యాత్ స ప్రోక్తః పాణిమానికా
అక్షం పిచుః పాణితలం కించిత్పాణి శ్చ తిందుకమ్
బిడాలపదకం చైవ తథా షోడశికా మతా
కరమధ్యో హంసపదం సువర్ణం కవలగ్రహః
ఉదుంబరం చ పర్యాయైః కర్ష ఏవ నిగద్యతే
స్యాత్ కర్షాభ్యా మర్ధపలం శుక్తి రష్టమికా తథా
శుక్తిభ్యాం చ పలం జ్ఞేయం ముష్టి రామ్రం చతుర్థికా
ప్రకుంచ షోడశీ బిల్వం పల మే వాత్ర కీర్త్యతే
పలాభ్యాం ప్రసృతి ర్జ్ఞేయా ప్రసృత శ్చ నిగద్యతే
ప్రసృతిభ్యా మంజలిః స్యాత్ కుడ వోఽర్ధశరావకః
అష్టమానం చ స జ్ఞేయః కుడవాభ్యాం చ మానికా
శరా వోఽష్టపలం తద్వజ్ జ్ఞేయ మత్ర విచక్షణైః
శరావాభ్యాం భవేత్ ప్రస్థ శ్చతుః ప్రస్థై స్తథాఢకమ్
భాజనం కంసపాత్రం చ చతుష్షష్టిపలం చ తత్

చతుర్భి రాఢకై ర్ద్రోణః కలశో నల్వ ణోర్మణః
ఉన్మానం చ ఘటో రాశి ర్ద్రోణపర్యాయసంజ్ఞకాః
ద్రోణాభ్యాం శూర్పకుంభౌ చ చతుష్షష్టిశరావకాః
శూర్పాభ్యాం చ భవేద్ ద్రోణీ వాహీ గోణీ చ సా స్మృతా
ద్రోణీచతుష్టయం ఖారీ కథితా సూక్ష్మబుద్ధిభిః
చతుస్సహస్రపలికా షణ్ణవత్యధికా చ సా॥

తా॥ శార్ఙ్గధర సంహితయందు మాగధీయమను పేరున నొక మానమిట్లు చెప్పబడియున్నది. కాని ఈమానమునకు మాగధీయమను పేరు ఏకారణముచే పెట్టబడినదియు తెలుసుకొనుటకు మూలములు కనుబడకున్నవి. కొందరు దీనిని భావమిశ్రోక్త మాగధమాన మని వ్రాసియున్నారు. భావమిశ్రులు మానపరిభాషగాని ప్రత్యేక మానము గాని వ్రాసినట్లు కనుబడుటలేదు. ఈమానమునందు పరమాణువు కనిష్ఠమానముగను ఖారి గరిష్ఠమానముగను గ్రహింపబడినది. అందుచే పరమాణువుయొక్క స్వరూపము నిర్ణయించి అచ్చటినుండి మానములను చెప్పవలసియుండుటచే మొదట పరమాణుస్వరూపము నిర్ణయింపబడు చున్నది. పరమాణువనగ అతిసూక్ష్మమగు ద్రవ్యభాగము. పరమాణు వుకంటె సూక్ష్మమగు ద్రవ్యముండదు. పరమాణువును విభాగము చేయుటకు వీలుండదని సిద్ధాంతముచేయబడినది. పరమాణువు కండ్ల కగుపడునదికాదు. అది కేవలము బుద్ధిచే ఊహింపబడదగినదై యున్నది,

“ పరమాణు స్తు సూక్ష్మత్వాత్ భావగ్రాహ్యో న చక్షుషా”

అనిమతిమొక గ్రంథకర్త ఈవిషయమును వ్రాసియున్నాడు. అందుచే కండ్ల కగుపడు పరిమాణ మగు త్రసరేణువును నిర్ధారణజేసి అది మొదలుగ ఏర్పడు మానము పేర్కొనబడును. మూలమున:—

శ్లో॥ జాలాంతరగతే భానౌ యత్ సూక్ష్మం దృశ్యతే రజః
తస్య త్రింశత్తమో భాగః పరమాణు స్స
జాలాంతరగతై సూర్య కరై వంశీ విలోక్యతే॥

సూర్యకిరణములు ఏదేనొకరంధ్రము యొక్క మధ్యభాగమునుండి ప్రవేశించి వ్యాపించునప్పుడు ఆకిరణ ప్రసారమునగాలికి తిరుగాడుచుండు సూక్ష్మద్రవ్యము లనేకములు మనకంట్ల కగపడుచుండును. ఒకగదియం దలి తక్కినభాగమంతయు చీకటిగనుండి ఒక్కచోటమాత్రము వెలుతురుగ జాలాంతరాగతములైన సూర్యకిరణములు లోనికి ప్రసరించుచుండునేని ఆగదియందు గాలితాకునన అటునిటు ఎగిరితిరుగాడుచుండు సూక్ష్మద్రవ్యము లీకిరణములలోనికి వచ్చినప్పుడు చీకటియందుండి చూచువారికిఆకిరణప్రసారమున నలుసులవలెసూక్ష్మద్రవ్యములనేకములు కనబడుచుండును. అట్టి సూక్ష్మద్రవ్యములలో అతిసూక్ష్మమై యుండునది త్రసరేణువు అను పేరున వ్యవహరింపబడును-దీనినే నైయాయికులు త్ర్యణుకమని వాడుదురు. ఈత్రసరేణువుయొక్క ముప్పదియవభాగము పరమాణు వని చెప్పబడును. మఱియుపదిపరమాణువులు ఒక అణువు. ఇరువదిపరమాణువులు ఒకద్వ్యణుకము. ముప్పదిపరమాణువులు ఒక త్ర్యణుకము నగునని అన్యతంత్రములనిర్ణయము కలదు. దీనినే పది పరమాణువులొకయణువు, రెండణువులొక ద్వ్యణుకము మూడణువులొకత్ర్యణుకము నగుననికూడ చెప్పవచ్చును. మూలము :—

శ్లో॥ త్రసరేణు బుధైః ప్రోక్తః త్రింశతా పరమాణుభిః
త్రసరేణు స్తు పర్యాయనామ్నా వంశీ నిగద్యతే ॥

ఇట్టి పరమాణువులు ముప్పదిగలదైన ఒక త్రసరేణు వగును. త్రసరేణువునకు వంశీయను పర్యాయనామము కలదు- పర్యాయనామమనగ మాఱుపేరు. వాశరంధ్రములనుండి ప్రవేశించు కిరణములయందు గోచరించు రజమగుటచేగాబోలును దీనికివంశీయనుపేరుకలిగెను.

" వంశీరంధ్ర ప్రవిష్టం యద్ రజ స్తద్వంశీ, తస్యాస్త్రింశతా పరమాణునా యా సంఖ్యా సా వంశీత్యర్థః " అని గూఢార్థదీపిక.

ఇట్టి వంశీపరిమాణముకలిగిన ద్రవ్యమే జాలాంతరగతకిరణముల యందగుపడును. కాని అంతకు క్రిందిమాత్రపు పరిమాణముగల ద్రవ్యములు దృష్టికి గోచరింపవు.

"త్రింశతా పరమాణుభిః" అనుచోట "వింశత్యాద్యాస్స దైకత్వే సంఖ్యా స్సంఖ్యేయ సంఖ్యయోః"

అను ప్రమాణముచొప్పున ఏకవచనాంతమగు "త్రింశతా" యను పదము బహువచనాంతమగు "పరమాణుభిః" అనుపదమునకు విశేషణ వాచకముగ ప్రయోగింపబడెను. కొందరీపాఠము "త్రింశద్భిః పరమాణుభిః" అనిసవరించియున్నారు. ఈసవరణమంత సౌష్టవముకలిగినదికాదు.

శ్లో॥ షడ్వంశీభి మరీచిః స్యాత్తాభి ష్షడ్భి స్తు రాజికా
తిసృభీ రాజికాభి శ్చ సర్షపః ప్రోచ్యతే బుధైః
యవో ష్టసర్షపః ప్రోక్తో గుంజా స్యాత్తచ్చతుష్టయమ్
షడ్భి స్తు రక్తికాభిః స్యా న్మాషకో హేమధాన్యకౌ॥

ఆరువంశులొకమరీచి. మరీచియన కిరణము. ఆరుమరీచులొక రాజిక. రాజిక యనగ సన్నావగింజ. మూడు రాజికలు ఒక సర్షప మగును. సర్షపమనగ తెల్లావగింజ. ఎనిమిది సర్షపములు ఒకయవము. యవమనగ తన్నామముచే ప్రసిద్ధమైయుండు ధాన్యవిశేషము. నాలుగు యవములు ఒకగుంజ. గుంజయనగ గురివిందగింజ. దీనికే రక్తికయను పేరుకలదు. ఆరుగుంజలు ఒక మాషము. ఇది ఒక అణా యెత్తగును. మాషమనగ మినుము. దీనికే మాషక మనియు హేమమనియు ధాన్యకమనియు పేర్లు కలవు. దీనికి పెట్టబడిన హేమమను పేరు ఏతత్ పరిమాణ విశిష్టమగు ఒక బంగరు నాణెము ఒక కాలమున చెల్లుబాటునందుండుటను సూచించుచున్నది.

శ్లో॥ మాషై శ్చతుర్భిః శాణః స్యా ద్ధరణ స్స నిగద్యతే
టంక స్స ఏవ కథిత స్తద్ద్వయం కోల ఉచ్యతే
క్షుద్రకో వటక శ్చైవ ద్రంక్షణ స్స నిగద్యతే॥

నాలుగు మాషము లొక శాణము. ఇది పావు తులమునకు సరిపోవును. ఈశాణమునకే ధరణ మనియు టంక మనియు పేర్లుకలవు. రెండు శాణము లొక కోలము. కోలమనగ రేగు. దీనికే క్షుద్రక మనియు వటకమనియు ద్రంక్షణమనియు పేర్లు కలవు. ఇది అరతుల మునకు సరిపోవును.

శ్లో॥ కోలద్వయం చ కర్షః స్యాత్ స ప్రోక్తః పాణిమానికా
అక్షం పిచుః పాణితలం కించిత్పాణి శ్చ తిందుకమ్
బిడాలపదకం చైవ తథా షోడశికా మతా
కరమధ్యో హంసపదం సువర్ణం కవలగ్రహః
ఉదుంబరం చ పర్యాయైః కర్ష ఏవ నిగద్యతే ॥

రెండు కోలములు ఒక కర్షము. కర్షము నాలుగు శాణముల పరిమితి కలిగి యుండును. ఇది ఒక తులమునకు సరిపోవును. దీని పర్యాయ పదములు పాణిమానిక అక్షము పిచువు పాణితలము కించిత్పాణి తిందుకము బిడాలపదకము షోడశిక కరమధ్యము హంస పదము సువర్ణము కవలగ్రహము ఉదుంబరము అనునవి యై యున్నవి.

ఈ పర్యాయ పదములు కర్షమను ఈ పరిమాణము గట్టివస్తువులను తూచుటకును ద్రవములను చూర్ణములను కొలుచుటకును కూడ ఉపయోగించు ననియు అందుచే నిది మానముల లోనికెల్ల కొంత ప్రాముఖ్యమును చెందినదిగ నుండుననియు సూచించు చున్నవి. ఈ పర్యాయ పదములలో పాణిమానిక యనగ మానికవలె వ్రేళ్ళన్నియు కుంచి యుంచబడిన చేతియొక్క గుంట యను నర్థము తెలుపును "పాణి మానికా కరతలం విదురితి భావః" అని గూఢార్థ దీపిక. పాణితల కించిత్పాణి కరమధ్య హంసపద యను పర్యాయ పదములు కూడ ఈ యర్థమునే సూచించు చున్నవి. ఈ పర్యాయ పదములు కర్షమను నీమానము కరమధ్యమిచే కొలవదగిన ద్రవద్రవ్యముల కొలత కుపయుక్తమగ నుండగలదను విషయమును ఈ యర్థములవలన సూచించు చున్నవి. అక్షమనగ తాడికాయ తిందుకమనగ తుమ్మికి ఉదుంబర మనగ మేడికాయ. (అత్తికాయ) ఈపదము లీయర్థములవలన ఆ కాయల పరిమితిని ఉపయోగింపదగిన కల్క మోదకాదుల పరిమాణమును నిర్ణయించుటకు ఈమానము తగియుండునని సూచించుచున్నవి. తాణి కాయకు వాచకమగు అక్షశబ్దము కర్షమానమునకు పర్యాయవాచక నామమైనచే తాణికాయను కర్షఫలమను పేరుకూడ కలదు. ఈనామ

ములు వీని పరస్పర సంబంధమును సూచించుచున్నవి. సువర్ణమనునది ఒక బంగరునాణెము, మాషపరిమాణ వంతమును హేమనామకమును నగు బంగరు నాణెముకలదని చెప్పబడినదిగదా? దానికంటె గరిష్ఠమును కర్షపరిమాణ వంతమును సువర్ణనామకమును నగు నొక బంగరు నాణెము కూడ ఆకాలమున వాడుకలో నుండినట్లు మనము తెలుసుకొనదగియున్నది. ఆసువర్ణమే మనకర్షపరిమాణమునకు పర్యాయనామముగ గ్రహింపబడెను. ఈనామముచే కర్షపరిమాణము ఘనద్రవ్యములను చూర్ణద్రవ్యములను తూచుటకు కూడ ఉపయుక్తము కాగలదను విషయము నీయర్థమువలన సూచించు చున్నది. బిడాలపదక మనపిల్లి అడుగు. చిటికెనవ్రేలు తక్క తక్కిన నాలుగు వ్రేళ్ళను ముడిచి కూర్చి చూర్ణాదులను పట్టుకొనుటకు అనుకూలముగ నుండునట్లు పిల్లి అడుగు వలె యుంచబడిన పరిస్థితి నిది సూచించును. అందుచే నీపదము వలన చేతివ్రేళ్ళను పిల్లిఅడుగువలె ముడిచియుంచి తీయబడిన చూర్ణాదుల పరిమితి కర్షపరిమాణమున నుండునను విషయము నీయర్థము వలన సూచిత మగుచున్నది. "బిడాల పదకం అంగుళిత్రయ గ్రాహ్యం చూర్ణద్రవ్యం" అని గూఢార్థదీపిక. ఇట్లు దీనిపర్యాయ నామములన్నియు ఇది సర్వవిధములగు ద్రవఘన కల్కచూర్ణ మోదకాదుల పరిమాణముల తెలిసికొనుటకు సాధనముగ నుండగలుగుననియు ఇది అతిప్రాచీన నాణెమగు సువర్ణమునకు సరిపోవుననియు ఇట్లు దీనిగొప్పతనమును అనేకవిధముల సూచించు చుండుటచే మానములలోనెల్ల కర్షమానమునకుండు ప్రాముఖ్యమును తెలుపుచున్నవని మనమెంచవల్సియున్నది. "షోడశిక" యనునది పదునారుమాషముల పరిమాణము నుండుటచే దీనికి కలిగినది. ఇందుచే మాషమానము కూడ కొంత ప్రాముఖ్యము కలిగినదని మనమూహింపవచ్చును. "పిచు" శబ్దము వ్రణాదులయందుపయోగించు పిచుధారణము కర్షపరిమాణవంతముగ నుండవలయునని సూచించును.

శ్లో॥ స్యాత్ కర్షాభ్యాం మర్ధపలం శుక్తి రష్టమికా తథా
శుక్తిభ్యాం చ పలం జ్ఞేయం ముష్టి రామ్రం చతుర్థికా
ప్రకుంచః షోడశీ బిల్వం పల మే వాత్ర కీర్త్యతే ॥

రెండుకర్షములు లోక శుక్తియగును. దీనికి అర్ధపలమనియు అష్టమికయనియు పేర్లు కలవు- పలపరిమాణంబున నిది సగమగుటచే అర్ధపలమను నామము దీనికి కలిగెను- పలపరిమాణము దీనియనంతరమున చెప్పబడును- ఇది శాణమున కెనిమిది రెట్లధిక మగుటచే "అష్టమిక" యను నామము కలిగెను. శుక్తియన ముత్తెపుచిప్ప.

రెండుశుక్తు లొక పలమగును. పలమను నీ మానమునకు మానము లన్నిటికంటె ప్రయోగ మధికముగ కనబడు చుండును. కషాయాదులను సేవించుటకేమి సిద్ధము చేయుటకేమి పలము మధ్యమమగు పరిమాణముగ నుండుటచే సాధారణముగ నే యౌషధ మైనను పలము పరిమాణమున సేవింపదగినదిగ చెప్పబడియుండును-

మరియు పలమునకు క్రిందను మీదనునుండు మానము లన్నియు ఇన్ని పలము లనియు పలమున నిన్నవ వంతనియు పలమునుబట్టియే తెలుచువ్యవహరింప బడుచుండును. అందుచే తక్కిన మానములకంటె ఇది ప్రధానముగ నెంచబడు చున్నది- సాధారణముగ మాననిర్ణయమున కలుగు భేదములలో పలమానముయొక్క నిర్ణయము జరిగిన దానిని బట్టి తక్కిన మానములయొక్క నిర్ణయము జరిగించుట యగుచుండును- ఆంధ్రభేషజకల్ప విరచయితయు—

కం॥ వెలయు పరిమాణములలో । పలమెరిగిన క్రిందుమీదు పరిమాణంబుల్
తెలియగవచ్చును వికచో । త్పల లోచన నీ కెఱుంగ బలికెద తరుణీ ॥

యని చెప్పుచు నీ విషయమును స్పష్టపరచి యున్నారు-

నిజమునకు పలపరిమాణమును నిర్ణయించు నావశ్యకత ఆ కాలము నందువలెనే ఈ కాలమునందును అట్లే నిలిచి యున్నది-

కం॥ పలుగతుల శాస్త్రవేత్తలు । పలికెదరు పలపరిమాణ పద్ధతి నరుసన్
బలికెద దెలివిగ వినుము । బ్బలితంబగు మార్గములను సంకరజాతీ ॥

కం॥ పదునెనిమిది ముష్టులిక । పదిరెండున్నర పదారు పదియును బలాలున్
పదపడి యీ యెత్తులచే । బ్రామవుచువాల్గు ప్రకారముల బల మొప్పన్ ॥

కం॥ పదినిష్కంబులు పలమగు । పదిరెండగు నిష్కములును పలమగునట తొ
మ్మిది నిష్కములును పలమగు । పదపడి నిష్కంబులైదు పలమగు ధాత్రిన్

అని భేషజకల్ప గ్రంథకర్త పేర్కొనిన దానినిబట్టి ఆ కాలమునందే పలపరిమాణ నిర్ణయము జరుపబడిన ట్లగుపడుచున్నది. ఇట్లా కాలమునకే పలపరిమాణ నిర్ణయము విషయమున నేర్పడియుండిన పలు విధములగు పద్ధతులు ఇప్పటికిని సరియగు నిర్ణయము సంపాదింపక నే యుండిన ట్లగుపడుచున్నది. ఇందునకు కారణము సరియగు విమర్శనము జరుగకుండుటయు ఔషధములను చేయువారందఱును విమర్శనాశూన్యముగనే యౌషధపరిమాణములను తమకు తోచినరీతిని వేసుకొనుచుండుటయునై యుండవచ్చును.

ఎట్లయినను ప్రకృతకాలమున ఇన్ని నిష్కములు పలమనియు లేక ఇన్ని కర్షములు పలమనియు నిర్ణయముచేయుట అంతగ నుపయుక్తము కాజాలదు. కర్షనిష్కాదుల పరిమాణములు వాడుకలో లేనందున ననుభూతములై యుండు నప్పుడు అట్టివానిని బట్టి పలమును నిర్ణయించుటచే ఇప్పటివారికి కలుగబోవు లాభముండజాలదు. అందుచే నిప్పుడు మనకెక్కువ వాడుకలోనుండు మానములనుబట్టి పలపరిమాణమును గాని మఱియొక పరిమాణము గాని నిర్ణయించుటకు మనము పూనుకొనవలయును. ప్రకృతము మనకు వాడుకయందుండు పరిమాణములు తులములు చిన్నములు మొదలగునవి. కాబట్టి మనమెట్టి నిర్ణయము లొనర్చినను తులములు చిన్నములు మొదలగు మన దేశమున వాడుకచే ప్రసిద్ధములై యుండు మానములతో సరిపుచ్చుకొనుటకు ప్రయత్నింపవలయును

ప్రతిక్రృతపు వ్యవహారమునుబట్టి మూడుతులముల పలమొకటియు నాలుగు తులముల పలమొకటియు ఎనిమిది తులముల పలమొకటియు నిట్లు మూడురీతులగు పలములు దేశమున వ్యవహారమున నుండుట మనకు తెలిసియున్నది- దక్షిణాంధ్రములయందును పశ్చిమాంధ్రముల యందును తమిళదేశమునను మూడుతులముల పలము వాడుచున్నారు బొంబాయి ప్రాంతములవారును వారినిబట్టి మరికొందరును నాలుగు తులముల పలమును వ్యవహారమున నుంచి యున్నారు. భైషజ్యరత్నావళి యందు పలము ఎనిమిది తులముల పరిమాణము కలిగినదిగ నిర్ణయింప బడెను దానినిబట్టి బంగాళమువారు ఎనిమిది తులముల పలమును వాడుచున్నారు- ఈమూడురీతులగు పలముల పరిమాణములును ఈ గ్రంథమున ముందు ముందు వివరించి చూపబడును-

ముష్టి ఆమ్రము చతుర్థిక ప్రకుంచము షోడశి బిల్వము అనునవి పలమునకు పర్యాయనామములు. ముష్టియన పిడికిలి యని యర్థము ప్రకుంచమన పట్టెడు- ఈరెండు పదములును పిడికెడుగాని పట్టెడుగాని పరిమాణముగల చూర్ణములుగాని క్షోదకములుగాని పలపరిమాణము కాగలవను సూచనమును చేయుచున్నవి- ఆమ్రము బిల్వము అనునవి సామాన్యముగ మామిడికాయ యంతగగాని మారేడుకాయ యంతగ గాని చేయబడిన కల్కమోదకాదులు పలపరిమితములుగ నుండునని సూచించును. చతుఃకర్ష పరిమితమగుట ( నాల్గు కర్షముల పరిమితి నుండుట) చే చతుర్థికయనియు షోడశశాణ పరిమితమగుట (పదునారు శాణముల పరిమాణమున నుండుట)చే షోడశి యనియు పేర్లు కలిగెను-

శ్లో॥ పలాభ్యాం ప్రసృతి ర్జ్ఞేయా ప్రసృత శ్చ నిగద్యతే
ప్రసృతిభ్యా మంజలిః స్యాత్ కుడ వోర్ధశరావకః
అష్టమానం చ స జ్ఞేయః కుడవాభ్యాం చ మానికా
శరా వోష్టపలం తద్వజ్ జ్ఞేయ మత్ర విచక్షణైః

రెండుపలము లొక ప్రసృతియగును దీనికే ప్రసృతమని పేరు

కలదు. ప్రసారితాంగుళియగు కరము ప్రసృతియనియు ప్రసృతమనియు చెప్పబడును. ఇట్టిది చేరయగును. కావున ప్రసృతి ప్రసృతము అను నీరెండుపదములను చేరకు వాచకములుగ మనము గ్రహింపవచ్చును. "ప్రసారితాంగుళి కరతలం ప్రసృతిః" అని దీపిక. ప్రసృతి ఎనిమిది తులముల పరిమితి కలది. రెండుప్రసృతు లొక యంజలి యగును. అంజలియన దోసిలి. కుడవము అర్ధశరావము అష్టమానము అనునవి అంజలికి పర్యాయవాచకములు. దీని నామములలో అంజలిశబ్దము కంటెను కుడవశబ్దమునకు మానములలో ప్రాచుర్యమును చెందిన ప్రయోగము కలిగియున్నది. రెండుకుడవములు మానికా వాచకమగు శరావ మగుచు కావున కుడవమున కర్ధశరావ శబ్దము చెల్లుచున్నది. కుడవము (64) అరువదినాలుగు శాణములకు సమానమగును. శుక్తిని బట్టి ఎనిమిది రెట్లుండుటచే అష్టమానమను పేరు కలిగెను. కుడవము 16 తులముల పరిమితి కలిగినది.

రెండు కుడవము లొక మానికయగును. మానికయనుమానము ఆంధ్రదేశమున సుప్రసిద్ధమైనదిగనే యున్నది. దీనికి శరావమనియు అష్టపలమనియు పేర్లుకలవు. ఈపర్యాయ నామములలో శరావ పదము ప్రచుర ప్రసిద్ధి నందినదై యున్నది. శరావమనగ మూకుడు. అష్టపలమనగ ఎనిమిదిపలముల పరిమాణము కలిగినది. శరావము (128) శాణముల పరిమాణము కలిగినదిగ నుండును. ఇది 32 తులముల పరిమాణము కలిగినదగును.

శ్లో॥ శరావాభ్యాం భవేత్ ప్రస్థ శ్చతుః ప్రస్థైస్తథాఢకమ్
భాజనం కంసపాత్రం చ చతుష్షష్టిపలం చ తత్ ॥

రెండు శరావము లొక ప్రస్థము. పలపరిమాణమునకు పిమ్మటి మానములలో ప్రస్థమానము పలమానమువలెనే ప్రచుర ప్రచారము కలిగిన మానమై యున్నది. ఇది పలమునకు (16) పదు నారు రెట్లు పెద్దది. ఇది (64) అరువదినాలుగు తులముల పరిమాణము

కొన్నిచోట్ల వాడుకయందు దున్నవి. కలశము 32 శరావముల పరిమితి కలిగినదై యున్నది. ద్రోణము మొదలుగ చెప్పబడిన మానములు తఱచుగ ఆస వారిష్టములయందలి ద్రవముల కుపయోగమునకు వచ్చుచుండును. ద్రోణము 1024 తులముల పరిమాణమున నుండును. అది 1 మణుగు 2 శేర్లు 16 తులము లగును.

శ్లో॥ ద్రోణాభ్యాం శూర్పకుంభౌ చ చతుష్షష్టిశరావకః
శూర్పాభ్యాం చ భవే ద్ద్రోణీ వాహీ గోణీ చ సా స్మృతా॥

—రెండు ద్రోణము లొక శూర్పమగును. శూర్పమన చేట దీనికే కుంభమనియు పేరు కలదు. శూర్పము 64 శరావముల పరిమాణము కలిగినదిగ నుండును. ఇది 2048 తులముల పరిమాణము కలిగినది. అది 2 మణుగులు ఒక వీశె 8 తులములు అగును. కలశ మనకుండ. కుంభమన కడవ. రెండుకుండ లొక కడవకు సరి కాగలవు.

రెండుశూర్పములు ఒక ద్రోణియగును దీనికే వాహియనియు గోణియనియు పేర్లు కలవు. దీనిపరిమితి 64 ప్రస్థములు. దీనికి ద్రోణములు ఎనిమిదియగును. ఇది 4096 తులములగును. అయ్యది 4 మణుగుల 2 వీశెల 16 తులములు. వాహనమనగ గుఱ్ఱము ఎద్దు ఒక గుఱ్ఱముగాని ఎద్దుగాని మోయదగిన బరువు గొప్పని నిదివాహియనబడును. పూర్వకాలమున గుఱ్ఱములతోడను ఎద్లతోడను ధాన్యపు మూటలు మోయించుకొని పోవువాడుక యుండెను. అందుచే ఒక గుఱ్ఱము మోయగల బరువునకు వాహియని పేరిడిరి. గోణియనగ గోనె. గోణిశబ్దపు వికృతియే గోనె యై యుండవచ్చును.

శ్లో॥ ద్రోణీచతుష్టయం ఖారీ కథితా సూక్ష్మబుద్ధిభిః
చతుస్సహస్రపలికా షణ్ణవత్యధికా చ సా ॥

నాలుగుద్రోణులు ఒక ఖారియగును. ఇది 4096 పలముల పరిమాణము కలిగియుండును. ఇది 256 ప్రస్థములును 8 శూర్పములును

అగును ఇది 16384 తులములకు 16 కాణుగల 2 శేర్ 16 తులములును, 204 శేర్లు 3 పావుశేర్లు 4 తులములున్న పరిమాణము కలిగినదిగ నున్నది. ఇంగ్లీషు కొలతమానమునుబట్టి 4 గేలనుల 7 పెయింటుల 13 ఔన్సుల 4 డ్రాముల 48 మినిమము లగును.

పై జెప్పబడిన మానములలో తెలుపుచుగ గాజిక సర్షపము యవము మాషము గుంజ కోలము అక్షము ఆమ్రము బిల్వము అనునిట్టి ధాన్య ఫలాదులకు వాచకములగు పదములును ప్రసృతి అంజలి శూర్పము గోణి మున్నగు ధాన్యాదులుంచు ఆధారములకు వాచకములగు పదములును శరావము కుంభము కలశము ఘటము కాంస్యపాత్రము మొదలగు పాత్రములకు వాచకములగు పదములును ఆయామానము లకు వాచకములుగ ప్రయోగింపబడి యుండుట చూడనగును. అట్లు చేయుటయందు కలుగు సద్దోషము ప్రతిమానమును గ గుంజాదుల తూనికలకుగాని శూర్పాదుల కొలతలకుగాని సరిపోవలయుననుటగాని సరిపోవుననుటగాని కాదు. కాని సామాన్యముగ తూనికరాళ్లుగాని కొలత పాత్రములుగాని దొరికనప్పుడు సుమారుగ పరిమితులు వేసుకొన వలసిన ద్రవ్యములను గుంజాదులతో తూచి తీసుకొనుటకును దోసిళ్ళు మొదలగువానితో కొలిచి వేసుకొనుటకును ఉపయోగముగ నుండ వలయునను తలంపు చేతను కొంతయు హెచ్చుతగ్గులైనను బాధించని మోదకకల్కాదులను కోల అక్ష బిల్వాదులతో సరిసమానముగ గ్రహించుటకు అనుకూలముగ నుంచవలయునను తలంపు చేతను చూర్ణాదులను బిడాల పదకాములతోడను ద్రవద్రవ్యములను కరమధ్య ప్రసృతాముల (పుడిసిళ్ళ)తోడను స్వీకరింప ననువుగ నుండవలయునను తలంపు చేతను ఆయామానములను యవగుంజా కోలాదులనుము ప్రసృతి అంజలి శూర్పము గోణి మున్నగు వానికిని సుమారుగ సరిపోవునట్లుగ ఏర్పాటు చేసియున్నారు. ఈపద్ధతి నాగరికులకు మాత్రముగ తోచినను పల్లెలలోని వారికిని గ్రామవాసులకును ఔషధోపయోగమున చాలా సౌకర్యమును సౌలభ్యమును కలుగజేయగలదు. ఇప్పటికిని పల్లెలయందు

కంసలులు మున్నగువారు ధాన్యపుగింజలను గురివెందపూసలను తూని కలను ఉపయోగించుచుండుటయు కర్షకులు ధాన్యాదులను కొలుచుటకు కుంచలు టలు మున్నగువాని నుపయోగించుటయు అచ్చటచ్చట కలదు.

మరియు ఒక్కొక్క మానమునకే సువర్ణ హేమాది నామములును ప్రకుంచ కరమధ్యాది నామములును ఏర్పరచుట చూడ ప్రతి మానమును ఘనద్రవ్యములను ఉన్మానముచేయుట (తూచుట)కును ద్రవద్రవ్యములను చూర్ణములను పరిమాణముచేయుట (కొలుచుట)కును కూడ ఉపయోగింపవలయునని వారుద్దేశించుకొని యుందురని తోపింప జేయుచున్నది

పూర్వపు పద్ధతులును వ్యవహారములును వాదకలును ఎట్లుండినను అవి మంచివైనను చెడ్డవైనను ప్రకృత కాలమున ఈమానములను వ్యవహారమున కనుకూలములుగ చేయవలయుననిన ఈమానములను ప్రకృత కాలమున వ్యవహరింపబడుచుండు మానములకు సరిపుచ్చి చూపవలయును. ప్రకృతకాలమున తులములు చిన్నములు వీశెలు మణుగులు శేర్లు గేలనులు ఔన్సులు అను నిట్టి దైశిక వైదేశిక మానములు ప్రచారము గలిగియున్నవి. అందుచే ఆయుర్వేద ప్రసిద్ధములగు మానములను దైశిక ప్రచురములగు మానములకు సరిపుచ్చి చూపుటవలన ఇప్పటి వారికి మిగుల నుపకారకముగ కాగలదు. అందుచే ఈ క్రింద పైరెండు విధములగు మానములకును సాధర్మ్యము కల్పింపబడును.

ఈమానముల సాధర్మ్యకల్పనమున మొదట తులమునకు సరిపుచ్చవలయును. తులమునకు సరిపడు మానము నిర్ణయింపబడునేని దానినిబట్టి తక్కినవన్నియు సరిపడగలవు తులమునకు పిమ్మట చిన్నమునకు సరిపుచ్చుట ఆవశ్యకము. చిన్నమునకును తులమునకును సరిపడు మానమును మనము కనుగొంటిమేని తక్కినవన్నియు వానినిబట్టి సరిపడిపోవును. తులములనుబట్టియే మణుగుల మానమును శేర్ల మానమును గేలనుల మానమును కూడ సరిపడిపోవును. అందుచే తులములమాన

మునకును చిన్నముల మానమునకును ఈమానముతో సాధర్మ్యము కల్పించుటకు ఈక్రింది విధముగ మనము నిర్ణయము చేసుకొన వలయును.

మనమీసాధర్మ్య నిర్ణయము చేయుటకు ముందు గుంజకును తులమునకును గల సంబంధము నిర్ణయింపవలయును. తెనుగుదేశమున కొన్నిచోట్ల ముప్పదిచిన్నములు తులమని వ్యవహరింపబడు చున్నది. చిన్నము నాలుగు గురివెందపూసల యెత్తగుటవలన ఈలెక్కను తులమునకు (120) నూటఇరువది గురివెందపూసల ఎత్తగును. ఇట్లు అర తులమునకు 15 చిన్నములును పావుతులమునకు 7½ చిన్నములును అణాకు 7 ½ గురువెందపూసల యెత్తును కాగలదు. సామాన్యముగ చాలచిన్నవిగను పీలగనునుండెడి పూసలైనచో తులమునకు 120 వరకు తూగ గలవు. మంచిపూసలు 96 కంటె ఎక్కువ తూగవు. ఈలెక్కను బట్టి తులమునకు 24 చిన్నములు కాగవు ఇట్లు ½ తులమునకు 12 చిన్నములును పావుతులమునకు 6 చిన్నములును అణాయెత్తునకు (1½) ఒకటిన్నర చిన్నమును కాగలదు. అనగా అణాయెత్తున 6 గురువెందపూసలయెత్తు కాగలదు. అణాకు 6 గురివెందపూసల యెత్తుగ కడప కర్నూలుజిల్లాలయందు ఇప్పుడును వాడుక కలదు. మాగధీయ మానమునకూడ 6 గుంజలొక మాషమని చెప్పబడినది. మాషము అణా యెత్తగును. కాబట్టి అణాకు 6 గురివెంద పూసలనియు తులమునకు చిన్నములు ఇరువది నాలుగనియు అనగ (96) తొంబదియారు గురివిందపూసలయెత్తనియు నిర్ణయముచేయుటయే సమంజసమైయున్నది. కాబట్టి ఈలెక్కల వరుసను సరిపుచ్చుకొని ముందుచెప్పబోవు మానములన్నియు తులముల లెక్కకును మణుగుల లెక్కకును శిఖాశేరుల లెక్కకును గేలనుల లెక్కకును సరిపుచ్చ బడుచుండును. ఈసాధర్మ్య నిర్ణయమువలన సామాన్యముగ దేశమున వ్యవహరింపబడు తూంకెలు కొలతలు మున్నగు వానితో సరిచూచు కొనివైద్యులు ఔషధములను చేసుకొనుటకు సౌకర్యమేర్పడ గలదు. ఇక గేలనులకును ఆయుర్వేదమానమునకును ఈ క్రిందిరీతిని లెక్క సరిపుచ్చుకొన వలయును. ఒక

ఔన్సు (2-½) రెండుతులములన్నరకు సరిపోవును. ఔన్సునకు మినిమములు (480) నాలుగువందల ఎనుబది కాగలవు. తులమునకు 96 గుంజలు చొప్పున 2½ రెండుతులములన్నరకు (240) రెండువందల నలుబదిగుంజలు కాగలవు ఈలెక్కను గుంజకు రెండు మినిమములు సరిపోగలవు. ఈసర్దుబాటునుబట్టి గేలనుల లెక్కకును ఆయుర్వేదమానమునకును సరిపుచ్చవచ్చును. ఈసర్దుబాటుకై మనకు సాధర్మ్యము సంపాదింపవలసిన ఇతరమానములు తెలిసియుండవలయును. అందుకై దీనితోసాధర్మ్యము చూపదలచిన మానములలెక్క లీక్రిందను చూపబడును.

### తులములమానము

| మానము | ఒక తులమున | వడ్లగింజలు |
|---|---|---|
| 1-½ వడ్లగింజలు 1 పిరి | పావులా ¼ వ వంతు | పిరికి 1-½ |
| 4 పిరులు 1 కాని | అణా 1/16 వ వంతు | కానికి 6 |
| 4 కానులు 1 అణా | కాని 1/64 వ వంతు | అణాకు 24 |
| 4 అణాలు 1 పావులా | పిరి 1/256 వ వంతు | పావులాకు 96 |
| 4 పావులాలు 1 తులము | వడ్లగింజలు 1/384 వ వంతు | తులమునకు 384 |

| మణుగులమానము | శిఖాశేరులు | గేలనులమానము |
|---|---|---|
| 24 తులములు 1 శేరు | 5 తులములు 1 చటాకు | 60 మినిమములు 1 డ్రాము |
| 5 శేరులు 1 వీశె | 4 చటాకులు 1 పావుశేరు | 8 డ్రాములు 1 ఔన్సు |
| 8 వీశెలు 1 మణుగు | 4 పావుశేర్లు 1 శేరు | 16 ఔన్సులు 1 పౌను |
| | (80 తులములు) | 20 ఔన్సులు 1 పెయింటు |
| | | 8 పెయింట్లు 1 గేలను |

పైచూపబడిన సాధర్మ్యమునుబట్టి మాగధీయ మానోత్క్రమములగు మానములకు ప్రకృతము వాడుకయందుండు తులములు మణుగులు శిఖాశేరులు గేలనులు అనువానికి సంబంధించిన లెక్కలు ఎంతెంత కాగలదను విషయమును తెలుపు పథకమిక్రింద కనుపరుపబడినది. ఈపథకమున పరమాణువు మొదలు ఖారివరకునుండు మానములకును తక్కినమానములకునుగల సామ్యము చూపబడినది.

# మాగధీయ మానము

| సంఖ్య | కనిష్ఠ మానము | గరిష్ఠ మానము | కనిష్ఠమానముల మొత్తమెంత యగును? |
|---|---|---|---|
| 30 | పరమాణువులు | వంశి | |
| 6 | వంశులు | మరీచి | 180 పరమాణువులు |
| 6 | మరీచులు | రాజిక | 1080 ప. మా. 36 వంశులు |
| 3 | రాజికలు | సర్షపము | 108 వంశి 3240 ప. మా |
| 8 | సర్షపములు | యవము | 24 రాజికలు |
| 4 | యవములు | గుంజ | 32 సర్షపములు |
| 6 | గుంజలు | మాషము | 24 యవములు |
| 4 | మాషములు | శాణము | 24 గుంజలు |
| 2 | శాణములు | కోలము | 8 మాషములు |
| 2 | కోలములు | కర్షము | 4 శాణములు |
| 2 | కర్షములు | శుక్తి | 8 శాణములు |
| 2 | శుక్తులు | పలము | 4 కర్షములు |
| 2 | పలములు | ప్రసృతి | 8 కర్షములు |
| 2 | ప్రసృతులు | కుడవము | 4 పలములు |
| 2 | కుడవములు | శరావము | 8 పలములు |
| 2 | శరావములు | ప్రస్థము | 16 పలములు |
| 4 | ప్రస్థములు | ఆఢకము | 64 పలములు |
| 4 | ఆఢకములు | ద్రోణము | 256 పల. 16 ప్రస్థము |
| 2 | ద్రోణములు | శూర్పము | 512 పల. 32 ప్రస్థము |
| 2 | శూర్పములు | ద్రోణి | 1024 పల. 64 ప్రస్థము |
| 4 | ద్రోణులు | ఖారి | 4096 పల. 256 ప్రస్థము 8 శూర్పములు |

వాగ్భటమానము.

( అష్టాంగసంగ్రహము. )

మూ॥ వాక్యం॥ పరిమాణం పునః షడ్వంశ్యో మరీచిః తాః షట్ సర్షపః. తేష్టౌ తండులః. తౌ ధాన్యమాషః. తౌ యవః. అతః పరం చతుర్గుణవృద్ధ్యా అండికా మాషక శాణ కర్ష పల కుడవ ప్రస్థాఢక ద్రోణ వహాఃకల్ప్యంతే॥

వాగ్భటతంత్రమున ఒకవిధముగ మానము చెప్పబడి యున్నది- అది అనేకవిధముల మాగధమానమునకు సరిపోవును- కాని వంశి మొదలు మాషమువరకునుండు మానమున నామములయందును పరిమాణముననను ఈరెండు మానములకును కొంచెము భేదముకలదు- మాషము మొదలు ఖారివరకుగల మానపరిగణనమున భేదములేదు- మఱియు ఈమానపరిగణనమంతయు ఉత్తరోత్తరమున చతుర్గుణవృద్ధి కలిగి యుండునట్లు కల్పింపబడినది- ఆమానము ననుసరించి ఆరువంశి లొక మరీచి,ఆరుమరీచు లొక సర్షపము, ఎనిమిది సర్షపము లొకతండులము. రెండు తండులములు ఒక ధాన్యమాషము. రెండు ధాన్యమాషములు ఒకయవము- ఈ యవము మొదలుగనుండు పైమానమంతయు చతుర్గుణవృద్ధిగకల్పింపబడవలయును- అదియెట్లనన్న, నాలుగుయవము లొక అండిక- నాలుగు అండికలు ఒక మాషకము- నాలుగు మాషకములు ఒక శాణము- నాలుగు శాణములు ఒకకర్షము- నాలుగుకర్షములు ఒక పలము. నాలుగు పలములు ఒక కుడవము- నాలుగు కుడవములు ఒక ప్రస్థము- నాలుగు ప్రస్థములు ఒక ఆఢకము- నాలుగు ఆఢకములు ఒక ద్రోణము- నాలుగు ద్రోణములు ఒక వహము- ఈ మానములు చతుర్గుణవృద్ధిగ మార్చుటవలన సంకలన వ్యవకలన గుణకహార భాగహారములయందు సౌకర్య మేర్పడగలదు- ఈమానము——

శ్లో॥ శాణం పాణితలం ముష్టిః కుడవం ప్రస్థ మాఢకమ్
ద్రోణం వహం చ క్రమశో విజానీయా చ్చతుర్గుణమ్ ॥ అ- హృ- కల్ప-

అని అష్టాంగ హృదయమున శ్లోకబద్ధము కావించి చెప్పబడినది-

## అంతర్మానములు.

### ( అష్టాంగ హృదయము. )

అవతారిక — యవము మొదలుకొని యథోత్తర చతుర్గుణముగ మానములను చెప్పినను శాణము మొదలుకొనియుండు మానములలో రెట్టింపువృద్ధికలిగిన మానములుకూడ కొన్ని కనబడుచున్నవి అందుచే నవికూడ చెప్పుచు వానిపర్యాయపదములుకూడ చూపబడుచున్నవి.

మా॥ శ్లో॥ ద్వౌశాణౌ వటకః కోలం బదరం ద్రంక్షణశ్చ తౌ
అక్షం పిచుః పాణితలం సువర్ణం కవలగ్రహః
కర్షోబిడాలపదకం తిందుకః పాణిమానికా
శబ్దాన్యత్వ మభి న్నే ద్వే శుక్తి రష్టమికాపిమా
పలం ప్రకుంచో బిల్వం చ ముష్టి ర్మ్రామం చతుర్థికా
ద్వే పలే ప్రసుత స్తౌ ద్వా వంజలి స్తౌ తు మానికా
అధకం భాజనం కంసో ద్రోణః కుంభో ఘ టోర్మణమ్

తా॥ రెండుశాణములు కోలమనబడును. రెండు కోలములు కర్షము. రెండుకర్షములు పలము. రెండుపలములు ప్రసృతము. రెండు ప్రసృతములు అంజలి. రెండంజలులు మానిక. అని యిట్లు యథోత్తర ద్విగుణ మాన విభాగమంతయు మాగధమానమున చెప్పబడిన రీతిగ నేర్పరుపబడియున్నది. వీని పర్యాయ నామములలోకూడ భేదమేమియు కనుపడదు. కాని ద్రోణమునకు పైనుండు మానము అష్టాంగ హృదయమున ఏలనో చెప్పబడలేదు.

మరియు అష్టాంగ సంగ్రహమున: —

వా॥ ధరణం తు పలదశ భాగః. మాషకస్య
పర్యాయో హేమో ధానకశ్చ. శాణద్వయస్య
క్షుద్రమో కోలోవటక శ్చ. కర్షస్య సువర్ణ మక్షం పిచు
ర్బిడాలపదకం పాణితలం తిందుకం కవలగ్రహః షోడశికాచ.
కర్షద్వయస్య శుక్తిరష్టమికాచ. పలస్య ముష్టిః ప్రకుంచ
శ్చతుర్థికా బిల్వమాత్రం చ. పలద్వయస్య ప్రసృ తోష్టమా
నం చ. కుడవ స్యాంజలిః. కుడవద్వయస్య మానికా॥

అని పర్యాయనామములు చెప్పబడి యున్నవి. ఇందు ధాన్యమాష మనియు మాషకమనియు రెండువిధములగు మాషముల నామములలో భేదము చూపబడినది. సుశ్రుతమున వానికి క్రమముగ ధాన్యమాష హేమమాష నామములు చెప్పబడినవి.

# వాగ్భటమానము.

| సం. | కనిష్ఠ మానము | గరిష్ఠ మానము | కనిష్ఠమానముల మొత్త మెంత యగును? |
|---|---|---|---|
| 30 | పరమాణువులు | వంశి | |
| 6 | వంశులు | మరీచి | 180 పరమాణువులు |
| 6 | మరీచులు | సర్షపము | 36 వంశులు |
| 8 | సర్షపములు | తండులం (రక్తిక | 48 మరీచులు |
| 2 | తండులములు | ధాన్యమాషము | 16 సర్షపములు |
| 2 | ధాన్యమాషములు | యవము | 4 తండుల 32 సర్షప |
| 4 | యవలు | అండిక | 8 ధాన్యమా 16 తండు |
| 4 | అండికలు | మాషము | 16 యవము 32 ధా. మా |
| 4 | మాషములు | శాణము | 16 అండిక 64 యవము |
| 2 | శాణములు | కోలము | 8 మాషము 32 అండిక |
| 2 | కోలములు | కర్షము | 4 శాణము 16 మాష |
| 2 | కర్షములు | శుక్తి | 4 కోలము 8 శాణము |
| 2 | శుక్తులు | పలము | 4 కర్షము 8 కోలములు |
| 2 | పలములు | ప్రసృతి | 4 శుక్తులు 8 కర్షములు |
| 2 | ప్రసృతులు | కుడపము | 4 పలములు 8 శుక్తులు |
| 4 | కుడపములు | ప్రస్థము | 8 ప్రసృతు 16 పలము |
| 4 | ప్రస్థములు | ఆఢకము | 16 కుడపము 32 ప్రసృతు |
| 2 | ఆఢకములు | శివము | 32 కుడ 8 ప్రస్థ 128 ప. |
| 2 | శివములు | ద్రోణము | 64 కు 16 ప్ర. 256 ప. 4 |
| 2 | ద్రోణములు | శూర్పము | 128 కు 32 ప్ర. 512 ప. 8 |
| 2 | శూర్పములు | వహము | 64 ప్రస్థ. 16 ఆఢ. 4 ద్రో |

# దీనికిసరిపోయెడు ఇతర మానములు

| తులములు | మణుగులు. | | | | శిక్కా శేరులు. | | | | గేలనులు. | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | మణుగులు | వీశెలు | శేర్లు | తులములు | శేర్లు | పావుశేర్లు | చటాకులు | తులములు | గేలనులు | పైంట్లు | ఔన్సులు | డ్రాములు | మినుములు |
| (1/256) | | | | | | | | | | | | | |
| (1/64) | | | | | | | | | | | | | 3 |
| (1/16) | | | | | | | | | | | | | 12 |
| (¼) | | | | | | | | | | | | | 48 |
| (½) | | | | | | | | | | | | 1 | 36 |
| ౧ | | | | ౧ | | | | | | | | 3 | 12 |
| ౨ | | | | ౨ | | | | | | | | 6 | 24 |
| ౪ | | | | ౪ | | | | | | | 1 | 4 | 48 |
| ౮ | | | | ౮ | | | ౼ | ౩ | | | 3 | 1 | 36 |
| ౧౬ | | | | ౧౬ | | | ౾ | ౧ | | | 6 | 3 | 12 |
| ౬౪ | | | ౨ | ౧౬ | | ౻ | ౸ | ౪ | | 1 | 5 | 4 | 48 |
| ౨౫౬ | | ౨ | ౦ | ౧౬ | ౩ | ౸ | ౾ | ౧ | | 5 | 2 | 3 | 12 |
| ౫౧౨ | | ౪ | ౧ | ౮ | ౬ | ౹ | ౽ | ౨ | 1 | 2 | 4 | 6 | 24 |
| ౧౦౨౪ | ౧ | ౦ | ౨ | ౧౬ | ౧౨ | ౻ | ౦ | ౪ | 2 | 4 | 9 | 4 | 48 |
| ౨౦౪౮ | ౨ | ౧ | ౦ | ౮ | ౨౫ | ౺ | ౼ | ౩ | 5 | 0 | 19 | 1 | 6 |
| ౪౦౯౬ | ౪ | ౨ | ౦ | ౧౬ | ౫౧ | ౸ | ౾ | ౧ | 10 | 1 | 18 | 3 | 12 |

( భే ష జ క ల్ప ము . )

అవ— రెండుమానికలు ఒక ప్రస్థము- ప్రస్థమునకును ఆఢక మునకును నడుమ అంతర్మానము లేదు- ఆఢకమునకు పిమ్మట అంత ర్మానములు కలవు- అవి భేషజకల్పమున ఈరీతిని చెప్పబడియున్నవి-

మూ॥ శ్లో॥ ఆఢకం భాజనం కంసపాత్రం పాద్యముఖం శుభమ్
భాండం సముద్రం కదళం తద్వయం తు శివం స్మృతమ్
ద్రోణం శివద్వయం కుంభ మున్మానో నల్వణో ఘటః
అర్మణః కలశ శ్చక్ర శ్చతుర్థాఢక ఇత్యపి
తౌ ద్వౌ తు ఖారి శ్శూర్పశ్చ తౌ మూషా గోణికా వహః

తా॥ ఆఢకము భాజనము కంసపాత్రము పాద్యముఖము. శుభము భాండము సముద్రము కదళము అనునవి ఆఢకమునకు పర్యాయపద ములు- రెండాఢకములు ఒక శివమనబడును. రెండుశివములు ఒక ద్రోణము- కుంభశబ్దము మొదలు చతుర్థాఢకపర్యంతములగు ఎనిమిది శబ్దములును ద్రోణపర్యాయ వాచకములు- రెండు ద్రోణము లొక శూర్పము- శూర్పమునకు ఖారిపర్యాయ వాచకము- రెండు శూర్పము లొక వహము- గోణికావహ శబ్దములు పర్యాయ వాచకములు-

అష్టాంగసంగ్రహమునను—

“ఆఢకస్య పాత్రం కంసశ్చ. ద్రోణస్య నల్వణార్మణోన్మానఘటకుంభకలశాః. ద్రోణద్వయస్య శూర్పః”

అని చెప్పబడియున్నది-

వాగ్భటమానమున ననేకాంశములు మాగధమానము ననుసరించు నవిగ నున్నవని చెప్పబడినది- అందుచే విశేష విషయములుతప్ప తక్కిన పర్యాయ నామాదులకు సంబంధించిన విశేషము లిందు వివరింపబడ లేదు- అట్టి విశేషములు మాగధమాన వివరణము ననుసరించియు వాగ్భట మాగధీయ మానములకు సంబంధించిన పథకములయందలి భేదముల ననుసరించియు తెలుసుకొనదగియుండును- ముందు చెప్పబడ బోవు రసతంత్రాదిమానముల విషయమునకూడ నట్లే చూచుకొన [illegible]

అవ్వలిక చరకసుశ్రుతులు తమ తంత్రములయందు మాన ములనెట్లు చెప్పియున్నారో చూతము.

సుశ్రుతమానము.

(సుశ్రుత చికిత్సాస్థానము)

మూ॥ వా॥ పలకుడవాదీనా మతో మానం వ్యాఖ్యాస్యామః
తత్ర ద్వాదశ ధాన్యమాషాః మధ్యమాః సువర్ణమాషకః తే షోడశ సువర్ణమ్.

తా॥ స్నేహపాకాదులయందుపయోగమునకు వచ్చు పల కుడ వాదుల మానములనిచ్చట చెప్పుచున్నారము-

పన్నెండు ధాన్యమాషములు ఒక సువర్ణమాషము. పదునారు సువర్ణమాషములొక సువర్ణము-

మూ॥ వా॥ తతశ్చోర్ధ్వం చతుర్గుణ మభివర్ధయంతః పల కుడవ ప్రస్థాఢక ద్రోణా ఇత్యభినిష్పద్యంతే.

తా॥ కర్షమునకు పిమ్మట పలము కుడవము ప్రస్థము ఆఢకము ద్రోణము అను మానములు నాలుగేసిరెట్లుగ పెంపొందింపబడి యేర్పడుచున్నవి. దానినిబట్టి — ౧½ పిరి ౧ ధాన్యమాషము

| | | |
|---|---|---|
| 12 ధాన్యమాషకములు | సువర్ణమాషము | ౦౪-౦౪ (ఒక అణా) |
| 16 సువర్ణమాషములు | సువర్ణము | ౧ తులము |
| 4 సువర్ణములు | పలము | ౪ తులములు |
| 4 పలములు | కుడవము | ౧౬ తులములు |
| 4 కుడవములు | ప్రస్థము | ౬౪ తులములు |
| 4 ప్రస్థములు | ఆఢకము | ౨౫౬ తులములు |
| 4 ఆఢకములు | ద్రోణము | ౧౦౨౪ తులములు |

అని యిట్లు సుశ్రుతుని మానవిభాగ మేర్పడగలదు. దీనిని పరిశీలించి చూచిన సుశ్రుతోక్తమాన విభాగమున సువర్ణమాష మారంభముగ చెప్పబడిన భాగమంతయు మాగధ వాగ్భటమానముల కెంతయు సరిపోలు చుండుట తెలియగలదు. ధాన్యమాషసువర్ణమాషముల యంతరము మాత్రము వాగ్భటమతమున 32 ను సుశ్రుతమతమున 12ను నై యున్నవి.

# చరకమానము

(చరక కల్పస్థానము)

మూ॥ శ్లో॥ షడ్వంశ్యస్తు మరీచిః స్యాత్ షణ్మరీచ్యస్తు సర్షపః
అష్టౌతే సర్షపారక్తాస్తండులశ్చాపి తద్ద్వయమ్
ధాన్యమాషో భవే దేకో ధాన్యమాషద్వయం యవః
అండకాస్తేతు చత్వారస్తాశ్చతస్రస్తు మాషకః
హేమశ్చధానకశ్చోక్తో భవేచ్ఛాణం తు తే త్రయః ॥

**తా॥ ఆరువంశులొక మరీచి ఆరుమరీచులొక సర్షపము ఆరు** రక్త సర్షపములు ఒక తండులము రెండు తండులములు ఒక ధాన్య మాషము రెండుధాన్యమాషము లొక యవము నాలుగు యవములు ఒక అండకము నాలుగు అండకములు ఒక మాషము ఈ మాషమునకు హేమమనియు, ధానకమనియు పేర్లుకలవు మూడుహేమ మాషములొక శాణమగును.

వాగ్భట చరకుల మానములు రెండును హేమమాషపర్యంతము ఒక్కరీతిగనే యున్నవి శాణము మొదలుగ భేదించినవి. వాగ్భటమానమున నాలుగుమాషములు శాణముకాగా చరకమానమున మూడు మాషములు మాత్రము శాణమగును అందుచే శాణము మొదలుగ నేర్పడియుండు మానమంతయు పై వాగ్భట మాగధ మానములు రెంటికిని నిదిభేదించును. మరియు "అష్టౌతే సర్షపారక్తాస్తండులశ్చాపి తద్ద్వయమ్" అనుచోట "అష్టౌతే సర్షపారక్తిః" అని మరియొక పాఠము కనబడుచున్నది అట్టి పాఠమున ఎనిమిది సర్షపములు రక్తియనబడునని యు రక్తికే తండులమను పేరుకలదనియు వ్యాఖ్యచేయవలసియుండును ఇట్టి పాఠమే వాగ్భటసమ్మతమైనది చక్రపాణిదత్తులు "అష్టౌతే సర్షపారక్తా" అనుపాఠమును గ్రహించియున్నారు.

మూ॥ శ్లో॥ శాణౌద్వౌద్రంక్షణం విద్యాత్ కోలంబదరమేవచ
విద్యాద్ద్వౌద్రంక్షణౌకర్షం సువర్ణంచాక్షమేవచ
బిడాలపదకం తచ్చ పిచుంపాణితలం తథా
తిందుకంచ విజానీయాత్ కవలగ్రహమేవచ॥

తా. రెండు శాణములు ఒక ద్రంక్షణమగును. ద్రంక్షణమునకు కోలమనియు, బదరమనియు పేర్లుకలవు. రెండుకోలములు ఒకకర్షము. ఇది సువర్ణము, అక్షము, బిడాలపదము, పిచువు, పాణితలము, తిందుకము, కవలగ్రహము అను పేరులుకలిగినదైయున్నది.

మూ॥ శ్లో॥ ద్వేసువర్ణే పలార్థంస్యా చ్ఛుక్తిరష్టమికా తథా
ద్వేపలార్థే పలం ముష్టిః ప్రకుంచోథ చతుర్థికా
బిల్వం షోడశికం చామ్రం ద్వేపలేప్రసృతం విదుః
అష్టమానంతు విజ్ఞేయం కుడవౌ ద్వౌతు మానికా॥

తా. రెండుకర్షములు అర్థపలము. ఇది పలార్థము శుక్తిఅష్టమిక యను నామములుకలిగినది. రెండుశుక్తులు ఒక పలము ముష్టిప్రకుంచము, చతుర్థిక, బిల్వము షోడశిక, ఆమ్రము అనునవి పలమునకునామములు. రెండుపలములు ఒకప్రసృతము ప్రసృతమునకు అష్టమానమను పేరుకలదు. రెండు కుడవము లొకమానిక. మానికయనగ శరావము. కుడవము రెండుప్రసృతుల పరిమాణముకలిగినది. అందుచే రెండు పలములు ప్రసృతమును రెండు ప్రసృతములు కుడవమును రెండుకుడవములు శరావమును కాగలదు.

అ॥ కుడవమనగా నేమి?

మూ॥ శ్లో॥ పలం చతుర్గుణం విద్యా దంజలిం కుడవం తథా ।
చత్వారః కుడవాః ప్రస్థశ్చతుఃప్రస్థమథాఢకమ్ ॥
పాత్రం తదేవ విజ్ఞేయంకంసః ప్రస్థాష్టకంతథా ।

తా॥ నాలుగుపలము లొక కుడవమగును. దీనినే అంజలియందురు నాలుగుకుడవములొక ప్రస్థము నాలుగుప్రస్థములు ఆఢకము ఆఢకమే పాత్రమనబడును ఎనిమిది ప్రస్థములు కంసమగును.

మూ॥ శ్లో॥ కంసశ్చతుర్గుణో ద్రోణశ్చార్మణం నల్వణంచతత్ ॥
స ఏవ కలశః ఖ్యాతో ఘటమున్మానమేవచ ॥
ఘటంతుద్విగుణం శూర్పోవిజ్ఞేయః కుంభఏవచ ।
గోణీం శూర్పద్వయం విద్యాత్ ఖారీం భారీం తథైవచ ।
ద్వాత్రింశచ్చైవజానీయాద్వాహం శూర్పాణిబుద్ధిమాన్ ॥

తా॥ నాలుగు కంసములొక ద్రోణము, ఆర్మణము నల్వణము కలశము ఘటము ఉన్మానము అనునవి ద్రోణపర్యాయ నామములు

రెండు ద్రోణములు శూర్పము. కుంభమనునది శూర్పమునకు మఱియొక నామము రెండు శూర్పములుగోణి. దీనికే ఖారియనియు భారియనియు పేర్లు. ముప్పదిరెండు శూర్పములొక వాహమగును.

| కనిష్ఠమానములు | గరిష్ఠమానము | క. మా. ఘెం. | తులములు |
|---|---|---|---|
| 6 వంశులు | మరీచి | | |
| 6 మరీచులు | సర్షపము | 36 వంశులు | |
| 8 సర్షపములు | తండులము | 48 మరీ | 3/8 వ. |
| 2 తండులములు | ధాన్యమాషము | 16 సర్ష | 3/4 వ. |
| 2 ధాన్యమాషములు | యవము | 32 సం॥ ధా. మా. | ౦8౦8— |
| 4 యవములు | అండకము | 8 ధా. మా. | ౦8౨౧౦ |
| 4 అండకములు | మాషకము | 16 యవ | ౦8-8౨ |
| 3 మాషములు | శాణము | 48 యవ | ౦8౩_8౦ |
| 2 శాణములు | కోలము | 6 మా. | ౦౹=8౨ |
| 2 కోలములు | కర్షము | 12 మా | ౧౹౹౨8౦ |
| 2 కర్షములు | శుక్తి | 8 శా. | ౧౹౦8౨ |
| 2 శుక్తులు | పలము | 16 శా. 48 మా. | 3 తులములు |
| 2 పలములు | ప్రసృతము | 8 క. | ౬ తుల |
| 4 పలములు | కుడవము | 16 క. 2 ప్రసృ | ౧౨ తు |
| 2 కుడవములు | మానిక | 8 ప. 32 క. | ౨౪ తు |
| 4 కుడవములు | ప్రస్థము | 16 ప. 2. మా. | ౪౮ తు |
| 4 ప్రస్థములు | ఆఢకము | 64 క. | ౧౯౨ తు |
| 8 ప్రస్థములు | కంసము | 32 కు. 2 ఆ | ౩౮౪ తు |
| 4 కంసములు | ద్రోణము | 32 ప్ర | ౧౫౩౬ తు |
| 2 ద్రోణములు | శూర్పము | 64 ప్ర | ౩౦౭౨ తు |
| 2 శూర్పములు | ఖారి | 4 ద్రో | ౬౧౪౪ తు |
| 32 శూర్పములు | వాహము | 64 ద్రో | ౧౯౬౬౮ తు |

తులములను బట్టి తక్కిన మానములు శేర్లు గేలనుల లెక్కలు చూచుకొననగును, పైరీతిని చరక సంహితయందు చెప్పబడి యుండు మానముల విభాగమును పరిశీలించి చూచితిమేని వంశి మొదలు మాషము వరకునుండు మానవిభాగమంతయు వాగ్భట మాన విభాగమునకు సరిపోవుటయు శాణము మొదలు వాహము వరకునుండు మానమంతయు భేదించుటయు కాననగును ఇట్టి భేదము శాణము మాషమాషముల పరిమితముగ చేయుటచే కలిగినది. మూడు మాషముల శాణము ఒక్క చరక మానమున తప్ప తక్కిన మానముల యందెచ్చటను వగుపడదు. తక్కిన మానములన్నిటియందును శాణము నాలుగు మాషముల పరిమితి కలిగినదిగ చెప్పబడినది ఈ త్రిమాష శాణమును బట్టి కోలము 6 అణాలఎత్తునకును కర్షము 12 అణాల ఎత్తునకును సరి పడుటచే పలము మూడు తులముల ఎత్తుమాత్రమగుచున్నది. ఇట్లు మాగధ వాగ్భట సుశ్రుత మానములయందు పలము నాలుగు తులములు కాగా చరకమానము పలము మూడు తులముల ఎత్తుగ మాత్రమేర్పడి ఆభేదము ఆఢకమువరకనువర్తించి పోయినది ఇట్లు మాగధవాగ్భట మానములయందు ఆఢకము రెండువందల ఏబదియారు (256) తులముల యెత్తు కాగా చరకమానమున ఆఢకము నూటతొంబది రెండు (192) తులముల యెత్తు మాత్రమగుచున్నది.

ఇదియిట్లుండ ఆఢకద్రోణములకు నడుమ కంసమను నొక ద్విగుణమానము ఏర్పరుప బడుటయు అయ్యది ద్రోణమున నాలవవంతుగ చేయబడుటయు సంభవమగుటచే ఆఢకమువరకు వచ్చిన విభేదము మరియొకరీతిగ పరిక్రమించి ఆఢకము వరకు మాగధాది మానములకు తొచ్చుగ నుండినది అంతటినుండి హెచ్చుగ మారినది. దీనినిబట్టి మాగధ ద్రోణము (1024) తులములకు సరిపోగా చరక ద్రోణము (1536) తులముల యెత్తయినది మరియు వాగ్భట వాహమును మాగధ ద్రోణము (4096) తులములు కాగా దానికి సరియగు చరకఖారి (6144) తులములైనది మరియు 32 ద్రోణములొక వాహముగ చెప్పబడి యుండుటచే (196608 తులముల పరిమాణముగల యొక గొప్పవాక

మొకటి అంతమునకు చేర్చబడినది ఇయ్యది కొంచెమెచ్చుగ మాగధ ఖారికి సరియగును. మాగధఖారి (16384) తులములు. ఇట్లు చరక సుశ్రుత వాగ్భట తంత్రముల యందు చెప్పబడిన మానముల పరస్పర భేదములు గమనింప దగినవై యున్నవి. భేషజకల్పమున జెప్పబడిన చరకమానము కొంతభాగము చరకమానమునుండియు కొంతభాగము వాగ్భటమానము నుండియు గ్రహింపబడినట్లు కనబడుచున్నది.

అందుచే నామానమున యథోత్తరచతుర్గుణమానమును యథోత్తర ద్విగుణమానమును కూర్పబడియుండును ఆ విషయమాలోచింపక చతుర్గుణమానము కోలమానమనియు ద్విగుణమానము తులామానమనియు భావించి ఆంధ్రభేషజకల్పమున ఈమానమిట్లు చెప్పబడినది.

క॥ అవు నొకమరీచి యారం । శువు లారుమరీచులైనచో సషపమా
నవి యెనిమిది వరిగింజగు । నవి రెండును ధాన్యమాష యవమవి రెండుఁ ॥

క॥ నాలుగు యవలుం గూడిన । వేళల నండిక మటంచు వెలయును నవియుఁ
నాలుగు గూడిన చోటఁ । మేలగు మాషం బటంచు మేదిని దనరుఁ ॥

సీ॥ మాషక ధాన్య హేమములు మాషాఖ్యలై । యవి రెండు శాణమై యవియు నాల్గు
పాణితలంబగు పాణితలంబులు । నాల్గు గూడిన ముష్టి నాల్గుముష్టు
లైనచో కుడవంబు నవినాల్గు ప్రస్థమా । నగునాల్గు ప్రస్థంబు లాఢకంబు
నాలుగాఢకము లెన్నగ ద్రోణమానంబు । గోలమాన మిది దూనికలకు వినుము ॥

గీ॥ వటకమగు శాణయుగళంబు వటక నామ।ధేయములు గోలబదరముల్ దృగ్మమనగ
నటకములు రెండుగూడిన వాసికెక్క । నక్ష మను బేర డబ్బెత్తనంగ నదయె ॥

గీ॥ కర్షము సువర్ణమును తిందుకము బిడాల। పదము కబళగ్రహము పిచు పాణితలము
అక్షమం బాణిమానిక లన్నదగును । అక్షమున కాఖ్యలైమాన మఱియుచోట ॥

క॥ అవి రెండు నరపలం బగు । వివరింపగ నదియుశుక్తి పేరొప్పెడు న
య్యవి రెండు పలము నిమ్కము । లవి షోడష సంఖ్య దగుచు నలవారు భువిఁ ॥

సీ॥ పలములు రెండైన ప్రస్పృతంబు నయ్యవి । రెండైన కుడవార్ధరీతి నవియు
యుగమైన కుడవంబు దగుకుండి కుండమ ॥ లంజలి యని దాని కాహ్వయములు
కుడవద్వయంబైన కుంభం బనందగు । పరికింపగ పదారు పలము లగును
అవినాలుగైనచో నాఢకంబగు కంస । భాజన శుభ మాఖ వాద్య పాత్ర
కలశ చషక సముద్రాఢకంబులనగ । నాఢకాఖ్యలు పదిదగు నాఢకములు
రెండు శివమగు శివములు రెండు ద్రోణ । సంజ్ఞ నొందును తన్నామసరణివినుము॥

గీ॥ ద్రోణ కుంభ శివ ద్వయోన్మాన కలశ । చక్ర నల్వణములు ద్రోణ సంజ్ఞ లమరు
ఖారియగు ద్రోణములు రెండుఖారి పేరు।శూర్పమగుశూర్పయుగళంబుగూర్పమాష ॥

ఈ పద్యములకు సంబంధించిన వివరణ సందర్భమున శ్రీ పండిత డి గోపాలచార్యులుగారు "ఇచ్చట పదియవ పద్యము మొదలు మూడు పద్యములు ధాన్యమానబోధకములుగను పదమూడవ పద్యము మొదలు పదునేడవ పద్యమువరకు నుండు పద్యములు ఆరును తులామాన బోధకములుగను విభజింపబడినవి ఇట్టి విభాగము సంస్కృతమున కానరాదు. అయినను మూలమున వంశి మొదలు ఘటమువరకు మానమును జెప్పి తిరిగి ఈ మానప్రణాళిలో చేరిన శాణమును మొదలు చేసి భారాంతమగు మానమును చెప్పుటచే శాణపర్యంతమగు మానము రెంటికిని సమానమనియు అచ్చటినుండి ధాన్యతులామానములకు భేదముకలదనియు సూచించుచుండుటచేతను మానస్వభావమును బట్టియు నామపద్ధతి ననుసరించియు గ్రంథకర్త యిట్లు విభజించినట్లగపడుచున్నది" అనివ్రాసియున్నారు.

సంస్కృతభేషజకల్పమానమునకును మూలమగు చరకఅష్టాంగసంగ్రహ అష్టాంగహృదయములయందును మొదట వంశి మొదలు యవపర్యంతములగు మానములు చెప్పి పిమ్మట యవాదివహ పర్యంతములగు యథోత్తర చతుర్గుణ మానములు చెప్పబడినవి పిమ్మట శాణము మొదలు కొనియుండు పరిమాణమున యథోత్తర ద్విగుణ మానములుకూడ వివరింపబడినవి. దానిననుసరించియే భేషకల్పమున (సంస్కృతము) వంశి మొదలు వాహాంతములగు మానములను యథోత్తర చతుర్గుణ పద్ధతిని వివరించి మరల "ద్వౌశాణౌవటకం" అని శాణాది వాహాంతములగు మానములలో యథోత్తర ద్విగుణ విభాగము చూపబడినది దానినిబట్టి ఇచ్చటను ద్విగుణ చతుర్గుణమాన వివరణ పరముగ విభాగమునకు సార్థక్యము కల్పించుట యుక్తియుక్తముగాని ధాన్యమాన తులామాన భేదమునుబట్టి భేదమేర్పాటు కల్పించుట యుక్తియుక్తముగ నగుపడదు.

# రసతంత్రమానము.

## ( రసరత్నసముచ్చయము. )

మా॥ ॥ త్రుటిః స్యా దణుభి షడ్భి స్తై ర్లిక్షా షడ్భిరీరితా
తాభి ష్షడ్భి ర్భవే ద్యూకః షడ్యూకా స్తద్రజః స్మృతమ్
షడ్రజః సర్షపం ప్రోక్త స్తైష్షడ్భి ర్యవ ఈరితః
ఏకా గుంజా యవై ష్షడ్భి ర్నిష్పావ స్తు ద్విగుంజకః
స్యాద్ గుంజా త్రితయం వల్లో ద్వౌ వల్లౌ మాష ఉచ్యతే
ద్వౌ మాషౌ ధరణం తే ద్వే శాణనిష్కకలాః స్మృతాః
నిష్కద్వయం తు వటకః స చ కోల ఇ తీరితః
స్యాత్ కోలద్వితయం తోలః కర్షో నిష్కచతుష్టయమ్
ఉదుంబరం పాణితలం సువర్ణం కవలగ్రహః
అక్షం బిడాలపదకం శుక్తిః పాణితలద్వయమ్
శుక్తిద్వయం పలం కేచి దన్యే శుక్తిత్రయం విదుః
తదేవ కథితం ముష్టిః ప్రకుంచో బిల్వ మిత్యపి ॥

తా॥ ఆరు అణువులైనచో ఒక త్రుటియగును. ఆరు లిక్షలు ఒక యూకము ఆరు యూకములు ఒక రజము. ఆరు రజములు ఒక సర్షపము ఆరు సర్షపములు ఒక యవము. ఆరు యవములు ఒక గుంజ. రెండు గుంజలు ఒక నిష్పావము. నిష్పావమనగ అనుము మూడు గుంజలు ఒక వల్లము. రెండువల్లములు ఒక మాషము. రెండుమాషములు ఒక ధరణము. రెండుధరణములు ఒక శాణము. దీనికే నిష్కమనియు కల యనియు పేర్లు కలవు. రెండు నిష్కములు ఒక వటకము దీనికే కోలమని పేరు కలదు. రెండు కోలములు ఒక తోలము. తోలమనగ తులము. దీనికే కర్షమను పేరుకలదు. ఇది నాలుగు నిష్కముల పరిమాణము కలిగినది. ఉదుంబరశబ్దము మొదలు బిడాలపదకశబ్దము వరకు నుండునవి. ఏడును దీనిపర్యాయ వాచకములు. రెండుతులములు ఒక శుక్తి. రెండుశుక్తులొక పలము. కొందరు పలమునకు మూడు

శుక్తులందురు, ముష్టి ప్రకుంచము బిల్వము అనునవి పలమునకు పర్యాయ వాచకములు.

మూ॥ శ్లో॥ పలద్వయం తు ప్రసృతం తద్వయం కుడ వోంజలిః
కుడవో మానికా తౌ స్యాత్ ప్రస్థో ద్వే మానికే స్మృతే
ప్రస్థద్వయం శుభం తౌ ద్వౌ పాత్రకద్వయ మాఢకమ్
తైశ్చతుర్భిర్ ఘటోన్మాన నల్వాన్యార్మణకుంభకాః
ద్రోణస్య శబ్దాః పర్యాయాః పలానాం శతకం తులా ॥

తా॥ రెండుపలములు ఒక ప్రసృతము- రెండుప్రసృతములు ఒక కుడవము- దీనికే అంజలియను పేరు కలదు- రెండుకుడవము లొక మానిక- రెండుమానిక లొక ప్రస్థము. రెండు ప్రస్థము లొక శుభము. రెండు శుభము లొక ఆఢకము- నాలుగు ఆఢకములు ఒకద్రోణము- ఘటము ఉన్మానము నల్వణము అర్మణము కుంభము అనునవి ద్రోణమునకు పర్యాయ వాచకములు-

రసతంత్రమానమునకును వాగ్భట మాగధమానములకును మొదటి నుండి మాషమువరకు నుండు మానములలో నామములయందును పరిమాణమునందును భేదములు కలవు- మాషము మొదలుగ ద్రోణము వరకునుండు మానములు పై రెంటికిని నామములలోను పరిమాణమునకూడ భేదించుచుండలేదు. మరియు శేషజకల్పనామానమున ఆఢక ద్రోణములకు నడుమ శివమను ద్విగుణమానము చేర్పరచినట్లేరసతంత్రమానమున ప్రస్థాఢకములకు నడుమ "శుభ"మను ద్విగుణమానము కటి కల్పింపబడినది- శివమను ద్విగుణమానము ద్రోణాఢకముల నడుమ చెప్పబడలేదు. శుభమను మానము పై రెండుమానముల యందును చెప్పబడియుండలేదు- మరియు ద్రోణముతో ఈమానము అపుచేయబడినది- ద్రోణమునకు పిమ్మట శూర్పవహాము లిందు చెప్ప బడలేదు. కర్షమానమునకు "తోల"మను పేరు ప్రసిద్ధము చేయబడినది- తోలమనగ తులము- దీనినిబట్టి కర్షము తులమునకు సరి

# రసతంత్రమానము

| సంఖ్య | కనిష్ఠ మానము | గరిష్ఠ మానము | కనిష్ఠమానముల మొత్త మెంత యగును? |
|---|---|---|---|
| 6 | పరమాణువులు | త్రుటి | |
| 6 | త్రుటులు | లిక్ష | 36 పరమాణువులు |
| 6 | లిక్షలు | యూకము | 36 త్రుటులు |
| 6 | యూకములు | రజము | 36 లిక్షలు |
| 6 | రజములు | సర్షపము | 36 యూకలు |
| 6 | సర్షపములు | యవము | 36 రజములు |
| 6 | యవములు | గుంజ | 36 సర్షపములు |
| 2 | గుంజలు | నిష్పావము | 12 యవములు |
| 3 | గుంజలు | వల్లము | 18 యవములు |
| 3 | వల్లములు | మాషము | 54 యవములు |
| 2 | మాషములు | ధరణము | 6 వల్లములు |
| 2 | ధరణములు | శాణము (నిష్కము) | 4 మాషములు |
| 2 | నిష్కములు | కోలము | 4 ధరణ 8 మాషము |
| 2 | కోలములు | తులము (కర్షము) | 4 నిష్కము 8 ధరణము |
| 2 | తులములు | శుక్తి | 4 కోలము 8 నిష్కము |
| 2 | శుక్తులు | పలము | 4 తులములు |
| *3 | శుక్తులు | పలము | 6 తులములు |
| 2 | పలములు | ప్రసృతము | 8 తులములు 4 శుక్తులు |
| 2 | ప్రసృతములు | కుడవము | 16 తులములు 8 శుక్తులు |
| 2 | కుడవములు | మానిక | 32 తులములు 16 శుక్తులు |
| 2 | మానికలు | ప్రస్థము | 4 కుడవములు |
| 2 | ప్రస్థములు | శుభము | 4 మానికలు |
| 2 | శుభములు | ఆఢకము | 4 ప్రస్థములు |
| 4 | ఆఢకములు | ద్రోణము | 8 శుభములు |
| * | మతాంతరము | | |

# దీనికిసరిపోయెడు ఇతర మానములు

| తులములు. | మణుగులు. | | | | శిఖా శేరులు. | | | | గేలనులు. | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | ఖండుగలు | మణుగు | వీశె | తులములు | వీశె | అర్ధవీశె | పట్కాలు | తులములు | గేలనులు | పాయింటులు | ఔన్సులు | డ్రాములు | మినిములు |
| 0808—7/9(1/144 | | | | | | | | | | | | | |
| 0808ξ5/9(1/72 | | | | | | | | | | | | | |
| 0801—1/8(1/48) | | | | | | | | | | | | | 4 |
| 08—80(1/16) | | | | | | | | | | | | | 12 |
| 02=80(1/8) | | | | | | | | | | | | | 24 |
| 01080(1/4) | | | | | | | | | | | | | 48 |
| 04080(1/2) | | | | | | | | | | | | 1 | 36 |
| ∩8080 | | | | | | | | | | | | 3 | 12 |
| ౨8080 | | | | | | | | | | | | 6 | 24 |
| Y8080 | | | | | | | | | | | 1 | 4 | 48 |
| ౬8080 | | | | | | | — | ∩ | | | 2 | 3 | 12 |
| ర8080 | | | | | | | — | 3 | | | 8 | 1 | 36 |
| ∩౬8080 | | | | | | | ξ | ∩ | | | 6 | 3 | 12 |
| 3౨8080 | | | ∩ | ౙ | | । | ౽ | ౨ | | | 12 | 6 | 24 |
| ౬Y8080 | | | ౨ | ∩౬ | | ఴ | o | Y | | 1 | 5 | 4 | 48 |
| ∩౨ర8080 | | ∩ | o | ర | ∩ | 4 | — | 3 | | 2 | 11 | 1 | 36 |
| ౨ధ౬8080 | | ౨ | o | ∩౬ | 3 | 8 | ξ | ∩ | | 5 | 2 | 3 | 12 |
| ∩o౨Y8080 | ∩ | o | ౨ | ∩౬ | ∩౨ | ఴ | o | Y | 2 | 4 | 9 | 4 | 48 |

పోవుటయు అది పలమున నాల్గవ వంతగుటయు సరియైనదేయను భావము కలుగజేయుచున్నది.

ఇక మాషమునకు వెనుకనుండెడి మానములలో పై చెప్పబడిన మాగధ వాగ్భటమానములకు రెంటికిని ఇది భేదించుచున్నది. వల్లనిష్పావ యూకా లిక్షా త్రుటులను నవి ప్రత్యేకముగ నిందుదహరింపబడియున్నవి. నిష్కమను నదియు వల్లమను నదియు బసవరాజీయాది గ్రంథములయందధికముగ వాడబడియున్నది. తోలశబ్దమునకు వికృతియగు "తులము" అను మానము ఆంధ్రదేశ ప్రసిద్ధము. ఇట్లు ఆంధ్రదేశ ప్రసిద్ధములగు మానములు మూడు యిందు వివరింపబడియుండుటచే నీమాన మాంధ్రవ్యవహృతమని మన మెంచదగియున్నది. మరియు సుశ్రుతోక్తమగు "నిష్పావ"మను మానముకూడ ఇందు గ్రహింపబడెను. అది కొంత మాషశాణములకు నడుమ "ధరణ"మను ద్విగుణ మానమొకటి చెప్పబడుటయు శాణమునకు నిష్కశబ్దము పర్యాయవాచక మొనర్చుటయు నను కొందువిశేషములుకూడనగుపడు చున్నవి. మాగధ వాగ్భట మానములయందు ధరణమను ప్రత్యేక మానము వాడబడలేదు సరికదా ధరణశబ్దము శాణమునకు పర్యాయ వాచకముగ చెప్పబడినది

"మాషైశ్చతుర్భిః శాణః స్యాద్ధరణస్సని గద్యతే" శా॥ సం॥

అని శార్ఙ్గధరసంహితయందు చెప్పబడియున్నది. ఇట్లింతవరకు చెప్పబడిన మాగధవాగ్భటరసతంత్రమానము లను మూడువిధములగు మానములను పరిశీలించి చూచినవారికి మాషాదులగు మానముల యందు ఏకవిధత్వమును మాషమునకు ముందటి మానములయందు భేదమును నుండుటయు మాషాదిమానములయందు అంతర్మానకల్పన మున ఈషద్భేదకల్పనము కలుగుచుండుటయు కన్పట్టగలదు. అంతర్మానములయందలి ఈషద్భేదములను పథకములసహాయమున జాగ్రతగ పరిశీలించి చూడదగును.

## వంగమానము.

(భైషజ్యరత్నావళీ.)

మూ॥ శ్లో॥ షట్సర్షపై ర్యవ స్త్వేకో గుంజైకా తు యవై స్త్రిభిః
మాషస్తు పంచభిః షడ్భి స్తథా సప్తభి రష్టభిః
నవభి ర్ద్వాదశభి శ్చ రక్తిభిః షడ్విధో మతః
మాషై శ్చతుర్భిః శాణః స్యాద్ ధరణం త న్నిగద్యతే
టంక స్స ఏవ కథిత స్తద్వయం కోల ఉచ్యతే
కోలద్వయం చ కర్షః స్యాత్ ప్రోక్తః పాణి శ్చ మానికా
స్యాత్ కర్షాభ్యా మర్ధపలం శుక్తి రష్టమికా తథా
శుక్తిభ్యాం చ పలం జ్ఞేయం ముష్టి రామ్రం చతుర్థికా ।
పలాభ్యాం ప్రసృతి ర్జ్ఞేయా ప్రసృతం చ నిగద్యతే
ప్రసృతిభ్యా మంజలిః స్యాత్ కుడవో ర్ధశరావకః
అష్టమానం చ స జ్ఞేయః కుడవాభ్యాం చ మానికా
శరావాభ్యాం భవేత్ ప్రస్థః చతుఃప్రస్థై స్తథాఢకమ్
చతుర్భి రాఢకై ర్ద్రోణః కలశో నల్వణోర్మణః
ద్రోణాభ్యాం శూర్పకుంభౌ చ చతుష్షష్టిశరావకః
శూర్పాభ్యాం చ భవేద్ ద్రోణీ వాహో గోణీ చ సా స్మృతా
గోణీచతుష్టయం ఖారీ కథితా సూక్ష్మబుద్ధిభిః
చతుస్సహస్ర పలికా షణ్ణవత్యధికా చ సా ॥

తా॥ ఆరుసర్షపములు ఒక యవము. మూడు యవములు ఒక గుంజ. అయిదుగాని ఆరుగాని ఏడుగాని ఎనిమిదిగాని పదిగాని పన్రెండు గాని గుంజలు ఒక మాషమగును. పన్రెండు గుంజల మాషము బంగాళదేశపు వ్యవహారమున కలదు. నాలుగు మాషములు శాణము. దీనికే ధరణమనియు టంకమనియు పేర్లు. రెండుశాణములు కోలము రెండు కోలములు కర్షము. రెండుకర్షములు శుక్తి. రెండుశుక్తులు పలము. రెండుపలములు ప్రసృతి. రెండుప్రసృతులు అంజలి. రెండంజలులు శరావము. రెండు శరావములు ప్రస్థము. నాలుగుప్రస్థములు ఆఢకము. నాలుగు ఆఢకములు ద్రోణము. రెండుద్రోణములు శూర్పము

# వంగమానము

| సం॥ | కనిష్ఠ మానములు | గరిష్ఠ మానము | కనిష్ఠమానముల మొత్తమెంత యగును? |
|---|---|---|---|
| 6 | సర్షపములు | యవము | |
| 3 | యవలు | గుంజ | 18 సర్షపములు |
| *5 | గుంజలు | | 15 యవములు |
| 6 | గుంజలు | | 18 యవములు |
| 7 | గుంజలు | మాషము | 21 యవములు |
| 8 | గుంజలు | | 24 యవములు |
| 10 | గుంజలు | | 30 యవములు |
| 12 | గుంజలు | మాషము | 36 యవములు |
| 4 | మాషములు | శాణము | 48 గుంజలు, 144 యవ. |
| 2 | శాణములు | కోలము | 8 మాషము, 96 గుం. |
| 2 | కోలములు | కర్షము | 4 శాణము, 16 మాష. |
| 2 | కర్షములు | శుక్తి | 4 కోల,8 శాణ,32 మా |
| 2 | శుక్తులు | పలము | 4 కర్ష, 8 కోల, 16 శా. |
| 2 | పలములు | ప్రసృతి | 8 కర్షము, 32 శాణము |
| 2 | ప్రసృతులు | కుడవము | 4 పలము, 16 క.64 శా |
| 2 | కుడవములు | శరావము | 8 పల, 32 కర్ష |
| 2 | శరావములు | ప్రస్థము | 4 కుడవము. 16 పలము |
| 4 | ప్రస్థములు | ఆఢకము | 16 కుడవము 64 పలము- |
| 4 | ఆఢకములు | ద్రోణము | 16 ప్రస్థము, 64 కుడవ- |
| 2 | ద్రోణములు | కుంభము | 32 ప్రస్థము, 128 కుడవ- |
| 2 | కుంభములు | గోణి | 16 ఆఢక, 64 ప్రస్థ |
| 4 | గోణులు | ఖారి | 8 కు.64 ఆఢ. 256 ప్ర |

* మతాంతరములు

రెండు శూర్పములు ద్రోణి- నాలుగుద్రోణులు ఖారి- ఈమానము భైషజ్యరత్నావళియందు చెప్పబడినది. భైషజ్యరత్నావళి వంగదేశమున సుప్రసిద్ధమైన వైద్యగ్రంథము. వంగులు దీనిని ప్రమాణముగ గ్రహింతురు- అందుచే నీమానమునకు వంగమానమని పేరుపెట్టి వ్రాయబడినది- ఈమానము పై చెప్పబడిన త్రివిధమానములకంటె పెద్దది- అనగ వానియందు చెప్పబడిన పలము నాలుగుతులముల తూకము కలిగియుండిన ఇందుచెప్పబడినది ఎనిమిది తులముల తూకము కలిగినదిగ నుండును- ఇట్లు తులమునుబట్టి చూచిన పై మానముల కిది రెట్టింపుగనుండుటచే వానికంటె నిది పెద్దదని చెప్పబడెను- అట్లగుటకు కారణము ఏమనగ— పై మూడుమానములయందును . ఆరుగుంజల మాషము గ్రహింపబడగ ఇందు పండ్రెండుగుంజలమాషము గ్రహింపబడెను. అందుచే మాషము మొదలుగనుండు మానములు పైవానికి రెట్టింపగుచుండును. వాగ్భట మాగధ రసతంత్ర మానములయందు చెప్పబడినచొప్పున పలము నాలుగుతులముల పరిమితి కలిగినదగును. ఈమానమునుబట్టి పలము ఎనిమిదితులముల పరిమితికలిగినది కాగలదు. వంగరాష్ట్రమున నిట్టి మానమునకే వ్యవహృతి కలిగియుండునట్లు తెలిసెడిని- ఇట్లే మాషపరిమితిభేదమునుబట్టి పల పరిమితి ప్రతిమానమునను మారుచుండుటకాన నయ్యెడిని. వంగీయమానమున పలమెనిమిది తులములు కలిగినదియైననుదీనినిబట్టి ఖారి ముప్పదిరెండువేల ఏడువందల అరువదినాలుగు తులములు ( 32764 ) పరిమితికలిగినదిగనున్నను అనగ కొంచెమెక్కువగ 34 మణుగుల తూకముకలిగినదైనను మాగధమానమునందువలెనే ఈమానమునను ఖారికి నాలుగువేల తొంబది యారు పలము లేయగుట విస్మయమును కలిగించును. ఇందు విస్మయకారమేమియు లేదు- మాగధవంగమానముల భేదము తన్మానబహిర్గతములగు తులములు మున్నగువానినిబట్టి లెక్కచూచినపుడే ఏర్పడగలుగునుగాని తత్తన్మానాంతర్గతములగు మాషశాణపలాదులను బట్టి చూచిన ఏర్పడజాలదు- మాషాదిమానముల గుణన మన్నిమాన

ములయందును ఒక్కరీతిగనే యుండును. మాషమునకు వెనుకనుండు మానముల భేదమునుబట్టి వానిలో పరస్పరము పరిమాణమున భేదములు కలుగుచుండును. ఇట్టివిశేషమే అన్నిటికంటె తక్కువ పరిమితికలిగిన దగు కాళింగమానమునకూడ నేర్పడకలదు. కాళింగమానమున రెండు తులములన్నర పలమే వ్యవహరింపబడినను అందు ఖారిపరిమితి ఒక వేయి ఇరువదినాలుగుతులములే (1024) యైనను అనగ సుమారు పదు నొకండు మణుగులు మాత్రమేయైనను దానికిని పలములు 4096 గనే యుండును. ఇట్లు సుమారు 11 మణుగులుండు కాళింగమానమునకు కొంచెమెచ్చు 17 మణుగులుండు మాగధమానమునను 34 మణుగులుండు వంగీయమానమునను ఖారికి 4096 పలములు సమానముగ నుండుట సందర్శింప గలదు. కావుననే మూడుమానములకును చివరనుండు

"చతుస్సహస్రపలికా షణ్ణవత్యధికా చ సా"

యనుశ్లోకభాగ మన్నిటికిని సరిసమానముగ నన్వయించును.

## కాళింగమానము.

(శార్ఙ్గధరసంహిత)

మూ॥ శ్లో॥ యవో ద్వాదశభిర్గౌరసర్షపైః ప్రోచ్యతే బుధైః
యవద్వయేన గుంజా స్యాత్ త్రిగుంజో వల్ల ఉచ్యతే
మాషో గుంజాభి రష్టాభిః సప్తభి ర్వా భవేత్ క్వచిత్
చతుర్భి ర్మాషకైః శాణః స నిష్కః టంక ఏవచ
గద్యాణో మాషకైః షడ్భిః కర్షః స్యా ద్దశమాషకః
చతుష్కర్షైః పలం ప్రోక్తం దశశాణమితం బుధైః
చతుష్పలైశ్చ కుడవం ప్రస్థాద్యాః పూర్వవ త్స్మృతాః ॥

తా॥ పండ్రెండుసర్షపములు ఒక యవము. రెండు యవములు గుంజ. మూడుగుంజలు వల్లము. ఎనిమిదిగుంజలు మాషము. ఏడు

# కాళింగమానము

| సంఖ్య | కనిష్ఠ మానములు | గరిష్ఠ మానము | కనిష్ఠమానముల మొత్త మెంత యగును? |
|---|---|---|---|
| 12 | సర్షపములు | యవము | |
| 2 | యవములు | గుంజ | 24 సర్షపములు |
| 3 | గుంజలు | వల్లము | 6 యవము, 72 సర్షప |
| 8 | గుంజలు | మాషము | 16 యవము, 192 సర్షప |
| * 7 | గుంజలు | మాషము | 14 యవము, 168 సర్షప |
| 4 | మాషములు | శాణము (నిష్కము) | 32 గుంజలు, 64 యవము |
| 6 | మాషములు | గద్యాణము | 48 గుంజలు $1\frac{1}{2}$ శాణము |
| 10 | మాషములు | కర్షము | 80 గుంజలు $2\frac{1}{2}$ శాణము |
| 4 | కర్షములు | పలము | 40 మాషము, 10 శాణము |
| 4 | పలములు | కుడవము | 16 కర్షములు, 160 మాష |
| 4 | కుడవములు | ప్రస్థము | 16 పలములు, 64 కర్షము |
| 4 | ప్రస్థములు | ఆఢకము | 16 కుడవము, 64 పలము |
| 4 | ఆఢకములు | ద్రోణము | 16 ప్రస్థము, 256 పలము |
| 4 | ద్రోణములు | ద్రోణి | 16 ఆఢకము, 64 ప్రస్థ |
| 4 | ద్రోణులు | ఖారి | 16 ద్రోణ, 64 ఆఢ, 256 ప్రస్థము, 4096 పలములు |
| * | మతాంతరము . | | |

# దీనికిసరిపోయెడు ఇతర మానములు

| తులములు. | మణుగు॥. | | | | శ్ఖా శేరులు. | | | | గేలనులు. | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | వీశెలు | [illegible] | శేర్లు | తులములు | శేర్లు | పావుశేర్లు | ఛటాకులు | తులములు | గేలనులు | క్వార్టులు | పైంట్లు | డ్రాములు | మినిములు |
| 0808–(1/256 | | | | | | | | | | | | | |
| ɔ808= (1/128) | | | | | | | | | | | | | |
| 08C1= (3/128) | | | | | | | | | | | | | |
| 08–80 (1/16) | | | | | | | | | | | | | 12 |
| ɔ80౾= (7/128) | | | | | | | | | | | | | 10½ |
| 01080 (1/4) | | | | | | | | | | | | | 48 |
| 01=80 (3/8) | | | | | | | | | | | | 1 | 12 |
| 04=80 (5/8) | | | | | | | | | | | | 2 | 0 |
| ౨4080 (2½) | | | | | | | | | | | 1 | 0 | 0 |
| ∩08080 | | | | | | | = | ○ | | | 4 | 0 | 0 |
| ४08080 | | | ∩ | ∩ε | | 4 | ○ | ○ | | | 16 | 0 | 0 |
| ∩ε08080 | | ∩ | ∩ | ∩ε | ౨ | 8 | ○ | ○ | | 3 | 4 | 0 | 0 |
| ε४08080 | | ϰ | ∩ | ∩ε | ర | 8 | ○ | ○ | 1 | 4 | 16 | 0 | 0 |
| ౨ɣε08080 | ౨ | ɣ | ∩ | ∩ε | 3౨ | 8 | ○ | ○ | 6 | 3 | 4 | 0 | 0 |
| 0౨४08080 | ∩o | ϰ | ∩ | ∩ε | ∩౨ర | 8 | ○ | ○ | 25 | 4 | 16 | 0 | 0 |

గుంజల మాషముకూడకలదు. నాలుగుమాషములు శాణము. దీని కేనిష్కమనియు టంకమనియు పేర్లు. ఆరు మాషములొక గద్యాణ మనబడును. పదిమాషములు కర్షము. నాలుగు కర్షములు పలము. నాలుగు పలములు కుడవము. నాలుగు కుడవములు ప్రస్థము. ఇట్లుపై తక్కిన మానమంతయు మాగధమానమందు చెప్పినట్లే చూచుకొనదగును.

ఇదివరకు చెప్పబడిన మానములలో మాగధీయ వాగ్భట రస తంత్రమానము మొదటకొంత వరకుకొంచెము భేదించినను మాషము మొదలు ఖారివరకు ఉండెడి మానములయందు సరిపడి పోవుచున్నవి. నామములలో ఈ షడ్భేదముతప్ప అంతగాఎక్కువైన భేదములేమియు లేవు. యాగయమానమున మాషము పండ్రెండుగుంజల పరిమితికలిగినదిగ చెప్పబడుటచే మాషముమొదలుగనుండెడి మానములు మాగధీయాద్యుక్త మానములకు రెట్టింపగుచున్నవి. కాలింగ మానము పై మూడు మానములలో కొంచెమెచ్చుగ సగము పరిమాణము కలిగియున్నది. కాలింగమానము మాషపరిమాణమున హెచ్చుగనున్నను కర్షపరిమాణమున మాగధపరిమాణమునకు తరిగిపోవు చున్నది. మాగధమానమునందు పదునారుమాషముల కర్షము చెప్పబడగా కాలింగమానమున కర్షము పదిమాషముల పరిమాణముగ మాత్రము చెప్పబడెను. అందుచే మాగధీయకర్షము పదునారణాలఎత్తు కాగా కాలింగకర్షము పదణాలఎత్తు మాత్రము కలిగినదిగ నున్నది. దీనినిబట్టి మాగధీయపలము నాలుగుతులముల పరిమాణము కలిగినదై యుండగ కాలింగపలము రెండుతులములన్నర పరిమాణము మాత్రము కలిగినదై యగుచున్నవి. ఇట్లేకర్షము మొదలుకొని ఖారివరకునుండెడి మానము లన్నియు కాలింగమానమున సుమారు సగము పరిమాణము కలిగినవిగ నున్నవి. మరియొకవిషయమేమన:— ఈసర్వమానముల యందును చెప్పబడియుండు మతాంతరములనుబట్టి కూడికచూచిన కొన్నిలెక్కలనుబట్టే ఐక్యము కూడకలుగ గలదు పై లెక్కలనుబట్టికాలింగమానము తగ్గుటచే శార్ఙ్గధరసంహిత యందిట్లు చెప్పబడియున్నవి.

శ్లో॥ కాలింగం మాగధం చేతి ద్వివిధం మాన ముచ్యతే
కాలింగా న్మాగధం శ్రేష్ఠం మానం మానవిదో విదుః
యతో మందాగ్నయో హ్రస్వా హీనసత్వా నరాః కలౌ
అతస్తు మాత్రా తద్యోగ్యా ప్రోచ్యతే సుజ్ఞసమ్మతా ॥

దీనిభావము. కాలింగమానమనియు మాగధమానమనియు మానములు రెండువిధములుగ నున్నవి. వానిలో మాగధమానము శ్రేష్ఠమైనది అనగ ఎక్కుడుపరిమాణముకలిగినది. అట్లేర్పడుటకు కారణము కలియుగమందలి ప్రజలు మందాగ్నులుగను హీనమైనసత్వము కలవారుగను నుండుటచే వారికి అనుగుణమగు మానము కల్పింపబడ వలసియుండుట. అందుచే తదుచితమగు మానము చెప్పబడినది. అను నదియై యున్నది. దీనినిబట్టి కాలింగమాగధమానములను రెండువిధములగు మానములు ఏర్పడుటకు కారణము. ఒకటి పూర్వపుయుగముల యందలి అధికసత్వులగు జనులకు ఉచితమగు పరిమాణముగల మానమును కల్పించుటయు రెండవది హీనసత్వులగు కలియుగమునందలి జనుల కుచితమగు పరిమాణముగల మానమును కల్పించుటయునై యున్నదనియు అందుచే కాలింగమానము కలియుగమునందలి జనులకు అర్హమగుమాత్ర కలిగినదియు మాగధమానముపూర్వపుయుగముల జనులకు అర్హమగుమాత్ర కలిగినదియు నై యున్నదనియు చెప్పుట శార్ఙ్గధరాచార్యునియభిప్రాయముగ కన్పట్టుచున్నది. అట్లయిన తక్కిన వంగమానము విషయమేమి? అది యేయుగముల యందలి మనుజుల కుపయోగించును? అనుప్రశ్నకు సదుత్తరముండదు. అందుచే మాన భేదము లేర్పడుటకు కారణము మరియొకరీతిగ ఊహింపవలసియున్నది. మానములు దేశభేదమునుబట్టి తఱచుగ మారిపోవుచుండును. ఇట్లు దేశభేదమునుబట్టి కలిగెడు మార్పులచే మాగధకాలింగాది మానముల భేదము లేర్పడినవి. నర్మదానదికిఉత్తరమున మగధరాజ్యమును నర్మదా నదికి దక్షిణమున కళింగరాజ్యమును ఒకకాలమున బాగుగవిస్తరిల్లి ప్రఖ్యాతములై యుండెను. తూర్పుసముద్రతీరమంతయు వంగదేశము

యున్నది. దీనినిబట్టి మగధదేశప్రసిద్ధమైన మానము మాగధీయ మానమనియు అది నర్మదానదికి ఉత్తరమున పశ్చిమసముద్రతీరము ననుసరించి వాడుక కలిగియుండెననియు కళింగదేశప్రసిద్ధమైనమానము కాలింగమానమనియు అది నర్మదా నదికి దక్షిణమున ఆంధ్రద్రవిడాది దేశములందు వ్యాప్తికలిగియుండెననియు వంగమానము వంగదేశమున ప్రసిద్ధినందియుండెననియు మనమూహించుట యుక్తముగను సయుక్తికముగను నుండును

" మానంతు ద్వివిధం ప్రోక్తం కాలింగమాగధం తథా
కాలింగాన్మాగధం శ్రేష్ఠమితి మానవిదో విదుః
కాలింగమపి మానంచ చరకాచార్య సమ్మతం "( సు. చి. 31. అ 7. సూ.)

అను డల్హణుని నిబంధ సంగ్రహవచనముకూడ ఈ భావమునే బలపరచును. సర్వప్రాచీనమగు చరకము అధమమాత్రను బోధించు కాలింగమానమును ఎట్లు సమ్మతించును? కావున కాలింగమానము కళింగదేశ ప్రసిద్ధమగు మానమని ఎంచుటయే సమంజసము. కళింగ దేశమును ఆంధ్రదేశమును దరిదాపులై యుండునవి యగుటచే ఈ రెండు దేశములమానములయందు కొంచెము మాత్రమగుపడెడు కొన్ని వైలక్షణ్యములుపకరీతిగ నుండును. రసతంత్రమానమునందు వలెనేదీనియందును వల్లనిష్కములు గ్రహింపబడుటయే కాక నిష్కము శాణపర్యాయముగ గ్రహింపబడినది. ఇట్టిసందర్భము మరేమానమునను నగుపడదు.

ఇంతవరకు చెప్పబడిన ఐదువిధములగు మానములలో మాగధీయరసతంత్ర వాగ్భటమానములు కొంచెమెచ్చుతగ్గుగ సరిసమాన ములగుటయు స్రౌతమానముకూడ వానికిసరిపోవుటయు వంగమానము వీనికి రెట్టింపగుటయు కాలింగమానము వీనికన్నిటికిని సరాసరి సగమగుటయు ననునవి ప్రకృతవ్యవహారమునందుండు తులచుల మానముతో వీనికి సాధర్మ్యకల్పనముచేయుటచే నేర్పడిన ముఖ్యఫలితమై యున్నది. మరియు మాషమునకు పూర్వమునందుండు మానములు ఈ వైవిధ్

లోను ఒకదానికొకటి సరిపోలుటలేదు. ఆమానములకంటెటి అధికమగు నుపయోగమును కానరాదు. వీనిలో సుశ్రుతోక్తమగు

“తత్ర ద్వాదశ ధాన్యమాషకా మధ్యమాః సువర్ణమాషకాః షోడశ సువర్ణం. అథవా మధ్యమ నిష్పావా ఏకోనవింశతి ర్ధరణం. తాన్యర్ధా తృతీయాని కర్షః”

అను మానభాగ మొద్దానితోడను ఎట్లును సమన్వయింపక యున్నది. వీనినన్నిటిని పరామర్శమొనర్చి మానముల జ్ఞానము బాగుగ సంపాదించి ఔషధయుక్తులం గడంగుట భిషక్కుల కర్తవ్యమై యున్నది

యథోత్తర చతుర్గుణ మానములు,

( శార్ఙ్గధరసంహిత )

మా॥శ్లో॥ మాషటంకాక్షబిల్వాని కుడవః ప్రస్థ మాఢకమ్
రాశి గోణీ ఖారి కేతి యథోత్తర చతుర్గుణాః

తా॥ మాషము శాణము కర్షము పలము కుడవము ప్రస్థము ఆఢకము ద్రోణము ద్రోణి ఖారి అను నీ మానములు ఒకదాని కన్న మరియొక్కటి నాలుగురెట్లు పెద్దవిగనుండును. అనగ నాలుగుమాషములు టంకము. టంకమన శాణము. నాలుగుశాణములు అక్షము- అక్షమన కర్షము-నాలుగుకర్షములు పలము-నాలుగుపలములు కుడవము, నాలుగు కుడవములు ప్రస్థము-నాలుగుప్రస్థములు ఆఢకము-నాలుగు ఆఢకములు ద్రోణము-ద్రోణమునకు రాశియనిపేరు-నాలుగుద్రోణములు ద్రోణి దీనికే గోణియనిపేరు- నాలుగుద్రోణులు ఖారి- ఇట్లు చెప్పబడిన పదిమానములును పూర్వపూర్వమునకు ఉత్తరోత్తరము నాలుగురెట్లు పెద్దదిగ నుండును- అనగపూర్వము నాలుగైన ఉత్తరమొక్కటియగును. అందుచేదీనికి యథోత్తరచతుర్గుణమానములనిపేరు కలిగెను- ఇట్లు యథోత్తర చతుర్గుణములుగ మానములను మార్చుటవలన సంకలనాదుల

యందు సౌకర్యమధికముగనుండును- ఆంధ్ర దేశపు బజారులయందు, నాణెముల లెక్కలన్నియు యథోత్తర చతుర్గుణపద్ధతినే మానకల్పన చేసి వాడుటకలదు-ఆయుర్వేదపరిభాషయందు "రాశిద్రోణీఖారికేతి" అను పాఠము కలదు- ద్రోణీగోణీశబ్దములు ఏకార్థకములగుట వలన ఈపాఠమునకును అదియే అర్థము కాగలదు- దీనినే వాగ్భటుడు-

"శాణంపాణితలం ముష్టిః కుడవం ప్రస్థమాఢకమ్,
ద్రోణం వహం చ క్రమశో విజానీయా చ్చతుర్గుణమ్॥

అని అష్టాంగహృదయమున యథోత్తర చతుర్గుణ విభాగము ననుసరించి చెప్పియున్నాడు- ఐన అష్టాంగహృదయమున "ద్వౌశాణౌవటక" మని శాణము మొదలుగ ద్రోణపర్యంతము మానవిభాగముచేసి యుండుటచే యథోత్తరచతుర్గుణ విభాగముకూడ శాణము నారంభించి వహాపర్యంతమగు మానములను పేర్కొయున్నాడు. కాని మానమున వహముగు పేర్కొనకున్నను వీనిలో వహముకూడ చెప్ప బడియున్నది-

మాగధవాగ్భట మానములకు చెప్పబడిన ఈయథోత్తర చతుర్గుణ పద్ధతిననుసరించి తక్కినకాళింగాది మానములకుకూడ యథోత్తర చతుర్గుణమాన విభాగము చేసుకొనవచ్చును-

ఈ క్రింద క్రమముగ మాగధ వాగ్భట వంగకాళింగ మానములకు యథోత్తర చతుర్గుణ పద్ధతిననుసరించి పదకములు చూపబడి యున్నవి. ఈపదకములయందు కనిష్ఠగరిష్ఠ మానములును వానితో సరిపోవు తులముల పరిమితులును చూపబడియున్నవి. తులముల పరి మాణముబట్టి తక్కిన మణుగులు శేరులు గేలనులు మొదలగు లెక్కలను ఊహించుకొనవచ్చును లేదావీనికి సరిపోయెడు ఇతర మాన ముల లెక్కలు వానివానికి సంబంధించియుండు ప్రత్యేకపదములయందు వివరముగ చూపబడి యుండుటచే వానియందు చూచుకొనవచ్చును.

# యథోత్తర చతుర్గుణ మానములు

## మాగధ మానము

| శ్లో | కనిష్ఠ మానములు | గరిష్ఠ మానము | తులములు |
|---|---|---|---|
| 4 | మాషములు | శాణము | ౦౧౦౮౦(1/4) |
| 4 | శాణములు | కర్షము | ౧౮౦౮౦ |
| 4 | కర్షములు | పలము | ౪౮౦౮౦ |
| 4 | పలములు | కుడవము | ౧౬౮౦౮౦ |
| 4 | కుడవములు | ప్రస్థము | ౬౪౮౦౮౦ |
| 4 | ప్రస్థములు | ఆఢకము | ౨౫౬౮౦౮౦ |
| 4 | ఆఢకములు | ద్రోణము | ౧౦౨౪౮౦౮౦ |
| 4 | ద్రోణములు | ద్రోణి | ౪౦౯౬౮౦౮౦ |
| 4 | ద్రోణులు | ఖారి | ౧౬౩౮౪౮౦౮౦ |

## వాగ్భట మానము

| శ్లో | కనిష్ఠ మానములు | గరిష్ఠ మానము | తులములు. |
|---|---|---|---|
| 4 | యవములు | అండిక | ౦౮౦౧౦(1/64) |
| 4 | అండికలు | మాషము | ౦౮౦౮౦(1/16) |
| 4 | మాషములు | శాణము | ౦౧౦౮౦(1/4) |
| 4 | శాణములు | కర్షము | ౧౮౦౮౦ |
| 4 | కర్షములు | పలము | ౪౮౦౮౦ |
| 4 | పలములు | కుడవము | ౧౬౮౦౮౦ |
| 4 | కుడవములు | ప్రస్థము | ౬౪౮౦౮౦ |
| 4 | ప్రస్థములు | ఆఢకము | ౨౫౬౮౦౮౦ |
| 4 | ఆఢకములు | ద్రోణము | ౧౦౨౪౮౦౮౦ |
| 4 | ద్రోణములు | శూర్పము | ౪౦౯౬౮౦౮౦ |
| 4 | శూర్పములు | ఖారి | ౧౬౩౮౪౮౦౮౦ |

# భైషజ్యరత్నావళిమానము

| శ్లో | కనిష్ఠ మానములు | గరిష్ఠమానము | తులములు |
|---|---|---|---|
| 4 | మాషములు | శాణము | ౦౯౦౭౦(1/2) |
| 4 | శాణము | కర్షము | ౨౭౦౭౦ |
| 4 | కర్షములు | పలము | ౮౭౦౭౦ |
| 4 | పలములు | కుడవము | ౩౨౭౦౭౦ |
| 4 | కుడవములు | ప్రస్థము | ౧౨౮౭౦౭౦ |
| 4 | ప్రస్థములు | ఆఢకము | ౫౧౨౭౦౭౦ |
| 4 | ఆఢకములు | ద్రోణము | ౨౦౪౮౭౦౭౦ |
| 4 | ద్రోణములు | ద్రోణి | ౮౧౯౨౭౦౭౦ |
| 4 | ద్రోణులు | ఖారి | ౩౨౭౬౮౭౦౭౦ |

# కాళింగమానము

| శ్లో | కనిష్ఠ మానములు | గరిష్ఠ మానము | తులములు. |
|---|---|---|---|
| 4 | కర్షములు | పలము | ౨౯౦౭౦ |
| 4 | పలములు | కుడవము | ౧౦౭౦౭౦ |
| 4 | కుడవములు | ప్రస్థము | ౪౦౭౦౭౦ |
| 4 | ప్రస్థములు | ఆఢకము | ౧౬౦౭౦౭౦ |
| 4 | ఆఢకము | ద్రోణము | ౬౪౦౭౦౭౦ |
| 4 | ద్రోణములు | ద్రోణి | ౨౫౬౦౭౦౭౦ |
| 4 | ద్రోణులు | ఖారి | ౧౦౨౪౦౭౦౭౦ |

## ఇ త ర మా న ము లు.

మూ॥శ్లో॥ తులా పలశతం తాసాం వింశతి ర్భార ఉచ్యతే
చత్వారింశత్ పలశతం తులాభారః ప్రకీర్తితః॥

తా॥ నూరుపలములు ఒకతులయగును. ఇరువదితులలు లేక 2000 పలములు ఒకభారమగును 2 భారములు లేక 4000 నాలుగు వేలపలములు ఒక తులాభారమగును. పలశతము తులయగునను విషయము మానములను చెప్పిన సర్వగ్రంథములయందును కలదు.

పలానాం ద్విసహస్రంచ భారఏకః ప్రకీర్తితః
తులాపలశతంజ్ఞేయా సర్వత్రైవైషనిశ్చయః ॥

అని చెప్పబడియున్నది. "సర్వత్రైవైషనిశ్చయః" అనుటవలన పలశతము తులయగునను విషయము మాగధాది సర్వమానముల యందు ఏకరీతిగనే యుండుననియు తక్కినమానములయందు భేదములున్నను దీనియందు మాత్రమెట్టి భేదము కలుగదనియు అందుచే మగధకళింగాది సర్వదేశములయందును ఈమాన మొక్కరీతిగనే నుండుననియు చెప్పటయైనది. మరియొకచోట.

« తులాపలశతం తాసాంవింశతిర్భార ఉచ్యతే
ఖారీభారద్వయేనైవ స్మృతామగ్ధాజనాధికా "

అని చెప్పబడియున్నది.

నాలుగువేలపలములు. ఒకతులాభారమగును. తులాభారమను నీమానమొక్క రసతంత్ర మానమునందు మాత్రమగుపడు చున్నది. "తులాభారము తూగుట" యనువ్యవహారము ఆంధ్రదేశవ్యవహారమున కలదు. కాని తులాభారమనునది ఒకమానమునకు వాచకమనియు తులాభార పరిమితమగు ధనముదానముచేయుట తులాభారమగుననియు చాలమందికి తెలియదు. తులాభారమనగ ఒకమనుష్యుని తూకమునకు

తూగుధనము దానముచేయుటయని వాడుక కలదు. అదిసరికాదు. తులాభారమనునది యొకవిశిష్టమానమునకు వాచకము. తులాభారమను పరిమాణముకంటె ఖారిపరిమాణము పెద్దది. తులాభారము 2 భారముల పరిమాణము కలిగినదై యుండ ఖారి రెండుభారములపై ఆరు ప్రస్థము లధికముగనుండును. ఖారికన్న తులాభారము ఆరు ప్రస్థముల పరిమాణము తక్కువగ నుండును.

## ఇ త ర మా న ము లు

| సంఖ్య | కనిష్ఠ మానములు | గరిష్ఠ మానము | కనిష్ఠమానముల మొత్త మెంతయగును |
|---|---|---|---|
| 100 | పలములు | తుల | 400 కర్ష, 1600 శా. 25కు 6 ప్రస్థములు 15 కుడ. |
| 2000 | పలములు | భారము | 20 తులలు |
| 4000 | పలములు | తులాభారము | 2 భారములు. 40 తుల. |

## వీనికి సరిపోయెడు ఇతర మానములు

| తులములు. | మణుగులు. | | | | శేర్లు. | | | | గేలనులు. | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | మణుగులు | వీశెలు | శేర్లు | తులములు | శేర్లు | పౌన్లు | ఔన్సులు | డ్రాములు | గేలనులు | క్వార్టులు | పైంట్లు | గిల్లులు | డ్రాములు |
| తుల॥ ౪౦౦ | | 3 | ౧ | ౧౬ | ౫ | 8 | ౦ | ౦ | 1 | 0 | 0 | 0 | 0 |
| భార॥ ౮౦౦౦ | ౮ | ౨ | 3 | ౮ | ౧౦౦ | 8 | ౦ | ౦ | 20 | 0 | 0 | 0 | 0 |
| తు॥ భార॥ ౧౬,౦౦౦ | ౧౬ | ౫ | ౧ | ౧౬ | ౨౦౦ | 8 | ౦ | ౦ | 40 | 0 | 0 | 0 | 0 |

## కాలమానము.

అవ: — ఇంతవరకు చెప్పబడిన మానములు ద్రవ్యములను తూచుటకును కొలుచుటకును ఉపయోగించును. ఇక కాలమానము చెప్పబడుచున్నది.

### సుశ్రుతసంహిత.

మూ॥ వా॥ తత్ర లఘ్వక్షరోచ్చారణమాత్రో కాలః అక్షినిమేషః.
పంచదశ అక్షినిమేషాః కాష్ఠా. త్రింశత్ కాష్ఠాః కలా.
వింశతికలో ముహూర్తః. త్రింశన్ముహూర్త మహోరాత్రం.
పంచాదశాహోరాత్రాణి పక్షః. తౌ మాసః. ద్వౌ మాసా వృతుః.
త్రయః ఋతవః అయనం. అయనే ద్వే వత్సరః. తే పంచ యుగ మితి

తా॥ ఒక్క లఘ్వక్షరమును ఉచ్చరించుటకు సరిపోయెడి కాలము అక్షినిమేష మనబడును. అక్షినిమేషమనగ రెప్పపాటు. పదునైదు అక్షినిమేషములు ఒక కాష్ఠ. ముప్పది కాష్ఠలు ఒక కల. ఇరువది కలలు ఒక ముహూర్తము. ముప్పది ముహూర్తములు ఒక అహోరాత్రము. కావున ముహూర్తము రెండుగడియలకాలమగును. పదునైదు అహోరాత్రములు ఒక పక్షము. రెండుపక్షములు ఒకమాసము. రెండుమాసములు ఒకఋతువు. మూడుఋతువులు లేక ఆరుమాసములు ఒకఅయనము. రెండుఅయనములు లేక పండ్రెండుమాసములు ఒక వత్సరము. వత్సరమునకు ఋతువులు ఆరు. ఐదువత్సరములు ఒక యుగము.

ఔషధములు చేయుటకును ఔషధముల నుపయోగించుటకును రోగకాలము నెరుంగుటకును ఇంకను ఇట్టివిశేషములను తెలుసుకొనుటకై వైద్యునకు కాలముపయోగించును. ఈకాలమానముచుకూడ వెనుకటి మానములయందువలెనే ప్రకృతకాలమున వ్యవహరింప బడుచుండు గంటలు మినిట్లు మున్నగు ఇంగ్లీషు కాలమానమునకును గడియలు విగడియలు మున్నగు దేశీయ కాలమానమునకును మార్చి తెలుసుకొనుట ఉపయుక్తము కాగలదు. అందుకై మనము ప్రయత్నింపవలసియుండును. ఒక అహోరాత్రమునకు ముహూర్తములు ముప్పది. గడి

# కాలమానము దీనికి సరిపోయెడి ఇతర మానములు

| సంఖ్య | కనిష్ఠ మానములు | గరిష్ఠ మానము | కనిష్ఠమానముల మొత్త మెంత యగును? | జ్యోతిషిక మానము | ఇంగ్లీషు కాలమానము |
|---|---|---|---|---|---|
| 15 | నిమేషములు | కాష్ఠ | 12/15 లిప్త ఒకనిమేషము | 2 లిప్తలు | 4-4/5 సెక. (8/25 సెక 1నిమేష. |
| 30 | కాష్ఠలు | కల | 450 నిమేషములు | 6విగడియలు | 2 మినిట్లు 24 సెకనులు |
| 20 | కలలు | ముహూర్తము | 600 కాష్ఠలు | 2గడియలు | 48 మినిట్లు |
| 30 | ముహూర్తములు | దినము | 600 కలలు | 60 గడియలు | 24 గంటలు |
| 15 | దినములు | పక్షము | 450 ముహూర్తములు | | |
| 30 | దినములు | మాసము | 900 ముహూర్తములు | | |
| 2 | మాసములు | ఋతువు | 60 దినములు | | |
| 3 | ఋతువులు | అయనము | 6 మాస 180 దిన. | | |
| 2 | అయనములు | సంవత్సరము | 6 ఋతు.12మా.360దిన. | | |
| 5 | సంవత్సరములు | యుగము | 10 అయ.30 ఋతువులు. | | |

యలు అరువది. గంటలు ఇరువదినాలుగు. దీనినిబట్టి అహోరాత్ర మునకు క్రిందనుండు కాలమానము నంతటిని పై రెండు కాలమానములతోడను సరిపుచ్చుకొనవచ్చును. అహోరాత్రమునకు పైనుండుకాలము అన్నిమానములయందును ఒకేరీతి నుండును. ఈ కాలమానమును ఇంగ్లీషుకాలమానమునకును దేశీయకాలమానమున కును మార్చిచూపబడిన పదకమిా క్రింద (౬౮ పే) కనుపరుపబడియున్నది.

> శ్లో॥ అష్టాదశ నిమేషా స్తు కాష్ఠా త్రింశ త్తు తాః కలా
> తాస్తు త్రింశత్ క్షణ స్తేతు ముహూర్తో ద్వాదశాస్త్రియాం
> తే తు త్రింశ దహోరాత్రః ॥ [అమరము]

ఈమానమునుబట్టి పదునెనిమిది అక్షినిమేషములు ఒక కాష్ఠ యగును. ముప్పదికాష్ఠములొక కల. ముప్పది కలలొక క్షణము. పండ్రెండు క్షణములొక ముహూర్తము. ముప్పది ముహూర్తము లొక యహోరాత్రము. తక్కినమానమంతయు సమానమే. అహో రాత్రమునకు దిగువనుండు కాలమానమున ఆయుర్వేదోక్తమునకును అమరసింహోక్తమునకును చాలభేదము కనుబడుచున్నది. ఆభేదమిా క్రిందచూపబడును.

ఒక అహోరాత్రమునకు.

| ఆయుర్వేదపద్ధతిని | | | అమరసింహునిపద్ధతిని |
|---|---|---|---|
| ముహూర్తములు | ... 30 | ... ... | 30 |
| క్షణములు | ... | ... ... | 360 |
| కలలు | ... 600 | ... ... | 10800 |
| కాష్ఠలు | ... 18000 | ... ... | 324000 |
| అక్షినిమేషములు | ... 270000 | ... ... | 5832000 |

ఈభేదము అమరమానమున కుణములమాన మధికముగ చేర్చుటవలన ముఖ్యముగకలిగినది- కాని మనకు ఆయుర్వేదోక్తమానమే పరిగ్రాహ్యమగును- అమరసింహుడు జ్యోతిషాది తంత్రములయందు చెప్పబడిన కాలమానవిశేషములనుబట్టి నిర్ణయించియుండవచ్చును-

ఆయుర్వేద చికిత్సకులకు ఉపయుక్తముగ నుండునంతవరకు సుశ్రుతసంహితయందు కాలమానము వివరింపబడినది. కాలమానజ్ఞానము వైద్యునకు ఔషధకాలములు జ్వరాదుల కాలములు ఆహారకాలములు ఔషధపాకాదుల కాలములు వస్త్యాది ధారణాకాలములు మున్నగు ననేకవిషయముల యందుపయోగమునకు వచ్చుచుండును.

## ఆయామమానము

[ భేషజకల్పము ]

మూ॥ శ్లో॥ జాలాంతరగతే భానౌ సూక్ష్మం యద్దృశ్యతే రజః।
పరమాణుస్తు సూక్ష్మత్వాద్ భానగ్రాహ్యో న చక్షుషా।
తే త్వష్టౌ త్రసరేణుః స్యాద్ రథరేణుస్తదష్టకమ్।
తదష్టకం తు తూలాగ్రం భవేల్లిక్షా తదష్టకాః।
అంగులిః స్యాద్ యవా శ్చాష్టౌ పాద ముక్తం షడంగుళం।
ద్వివితస్తే గరత్ని స్స్యాద్ వితస్తి ద్వాదశాంగుళం।
చతుర్వింశతిస్త్రిః కిష్కుః స్యాద్ ద్వౌ కిష్కూ- ధను రుచ్యతే।
ధనుస్సహస్రం క్రోశం స్యాద్ గవ్యూతి ద్విగుణం చ తత్।
గవ్యూతయ శ్చతస్రస్తు యోజనం పరిభాషితమ్।
అష్టౌ ధనుస్సహస్రాణి యోజనం ప్రోచ్యతే బుధైః॥

తా॥ ఎనిమిది పరమాణువులు ఒక త్రసరేణువగును. ఎనిమిది త్రసరేణువులు ఒకరథరేణువు. ఎనిమిది రథరేణువులు ఒకతూలాగ్రము.

ఎనిమిది తూలాగ్రములు ఒకలిక్ష. ఈలిక్షకే యవమనుపేరు కలదు. లిక్ష యవధాన్యమును నిలువుగనుంచినపుడు అది యాక్రమించెడి ప్రదేశము యొక్క వైశాల్యము కాగలదు. ఈపరిమాణము సుమారుగ 1/8 ఇంచికి సరిపోవును. ఎనిమిది యవములు ఒకఅంగుళి యగును. ఆరంగుళములు ఒక అడుగు. పండ్రెండు అంగుళములు ఒకవితస్తి. వితస్తియనగ జేన. రెండువితస్తులు ఒకఅరత్ని. అరత్నియనగ మూర. రెండుఅరత్నులు ఒక కిష్కువు. రెండుకిష్కువులు ఒకధనువు. వేయిధనువులు ఒకక్రోశము. రెండుక్రోశములు ఒకగవ్యూతి నాలుగుగవ్యూతులు ఒక యోజనము యోజనము ఎనిమిదివేల ధనువులగును

ఆయామమానము వస్తినేత్రములు ధూమనాడులు యంత్రములు శస్త్రములు పుటములు కోష్ఠులు ఆరోగ్యశాలలు రసశాలలు ప్రసూతిశాలలు మొదలగువాని నిర్మాణమున వైద్యునకు ఉపయోగించును. ఆయామమనగ పొడవు. ఈమానమును ప్రకృతకాలపు అడుగులు గజముల కొలతకు సరిపుచ్చుకొనుటకుగాను అంగుళము పరిమాణము రెంటికి సరిపోవునదిగ గ్రహింపవలయును. ఈరెండువిధములగు పరిమాణములలోను అంగుళము సరిపోవును. అందుచే అంగుళమునుబట్టి వీనిని సరిపుచ్చుకొనవచ్చును. మనఅంగుళము వారి "ఇంచి"కి సరిపోవును. దీనినిబట్టి పథకము సిద్ధముచేయబడినది.

"అంగుష్ఠే సకనిష్ఠే స్యాద్ వితస్తి ద్వాదశాంగులం" అనియు
"ప్రకోష్ఠే విస్తృతకరే హస్తోముష్ట్యాతుబద్ధయా
సరత్నిః స్యాదరత్ని స్తునిష్కనిష్ఠేన ముష్ఠినా" అనియు
"గవ్యూతిః స్త్రీక్రోశయుగం"

అనియును అమర సింహు డీవిషయములను నైఘంటికముగ నొనర్చియున్నాడు.

# దైర్ఘ్య మానము — దీనికి సరిపోయెడు ఇతర మానములు

| ఎన్ని? | కనిష్ఠ మానములు | గరిష్ఠ మానము | కనిష్ఠ మానముల మొత్త మెంతయగును | ఇంగ్లీషు మానము |
|---|---|---|---|---|
| 8 | పరమాణువులు | త్రసరేణువు | | |
| 8 | త్రసరేణువులు | రథరేణువు | 64 పరమాణువులు | |
| 8 | రథరేణువులు | తూలాగ్రము | 64 త్రసరేణువులు | |
| 8 | తూలాగ్రములు | లిక్ష[యవము] | 64 రథరేణువులు | ⅛ ఇంచి |
| 8 | యవలు | అంగుళము | 64 తూలాగ్రములు | ఒకయించి |
| 6 | అంగుళములు | పాదము | 48 యవములు | ½ అడుగు |
| 12 | అంగుళములు | వితస్తి | 96 యవములు | ఒకఅడుగు |
| 2 | వితస్తులు | అరత్ని | 24 అం॥లు 4 పాదములు | రెండు అడుగులు |
| 2 | అరత్నులు | కిష్కువు | 4 విస్తులు 48 అం॥ లు | 1 గజము 1 అడుగు |
| 2 | కిష్కువులు | ధనువు | 4 అరత్ను. 8విత. 96అం | 2 గజముల 2 అడుగులు |
| 1000 | ధనువులు | క్రోశము | 2000కిష్కువులు 8000అర | 1 మైలు 4 ఫర్లాంగుల 66 గ॥ల 2 అ॥ |
| 2 | క్రోశములు | గవ్యూతి | 2 వేల ధనువులు | 3 మైళ్ళు.0 ఫ॥లు 133 గ॥ 1 అడుగు |
| 4 | గవ్యూతులు | యోజనము | 8 క్రోశ. 8వేలధనువులు | 12 మై 2 ఫర్లాం 93 గజ 1 అడుగు |

సుశ్రుతశారీరస్థానమున త్వక్కుల పరిమాణములను చెప్పు సందర్భమున వ్యాఖ్యానముచేయుచు డల్వణాచార్యులు "వ్రీహిరత్రి యవః" ప్రత్యేకం "వ్రీహివిస్తారస్య వింశతిభాగాః పరికల్పనీయాః" అనియు "అంగుష్ఠోదరం వింశతి తమభాగేన మధ్యవపరిమాణం" అనియు వ్రాసియున్నారు. దీనినిబట్టి అంగుష్ఠోదరము ఆరుయవముల పరిమాణమున నుండునని వారి కభిమతమైనట్లు తెలియవచ్చుచున్నది. అంగుష్ఠోదర మంగుళపరిమాణమునకు సమమైనయెడల అంగుళమున కీలెక్కనుబట్టి ఆరు యవములుమాత్రి మగుటవలన యవము పరిమితి 1/6 ఇంచికి సరి పోగలదు.

అందుచే అంగుష్ఠోదర పరిమాణము అంగుళముకంటె. చిన్నదిగ మనము గ్రహింపవలసియున్నది. అట్లగునపుడు అంగుష్ఠోదరమును అంగుళమును ఒక్కటిగాక భిన్నములే కాగలవు. దీనినిబట్టి అంగుళము 1 ఇంచికిని అంగుష్ఠోదరము 3/4 ఇంచికిని సరికాగలవు. మరియు ఒక యవమునకు వ్రీహిభాగములు ఇరువదియగుటవలన ఒక అంగుళము నకు (160) నూటఅరువది వ్రీహిభాగములును అంగుష్ఠోదరమునకు(120 నూటయిరువది వ్రీహిభాగములును కాగలవు. ఇట్లు వ్రీహిభాగము 1/160 ఇంచికి సరిసమానము కాగలదు. ఈ లెక్కలనుబట్టి బుద్ధిమంతులు ప్రకృతకాలపు ఇంగ్లీషు దైర్ఘ్యమానమునకును ప్రాచీనకాలపు ఆయుర్వేద ఆయామమానమునకునురిమితులు సరిచూచుకొందురుగాక. "నరస్య మధ్యమా పర్వమధ్యమాంగుళిసంభవమ్ మానాంగుళమితి ఖ్యాతమ్।" అని మరియొకచోట అంగుళ పరిమాణము చెప్పబడి యున్నది. అవియన్నియు సుమారుగ చెప్పబడి యుండునవియగుటచే ఇంచు మించు పైమానమున చెప్పబడిన అంగుళమునకు సరిపోగలవు.

ఇట్లింతవరకును మాగధ వంగ కళింగ వాగ్భట రసతంత్ర భేద భిన్నములగు ద్రవ్యమానతులామానములును కాలమానమును ఆయామ మానమును సవిస్తరముగ వివరింపబడినది ఇదియాధారముగ మతాంతరములను లెక్కలువేసి బుద్ధిమంతులందరి విశేషముల పరిశీలించి జ్ఞానమునార్జింపదగును.

మా న ప రి భా ష ము గి సె ను.